త్వ ర ప డ ం డి !  అవకాశమును వినియోగించుకోండి !!

# 'శ్రీవాణి' చందాదారులకు విజ్ఞప్తి

| | | |
|---|---|---|
| సంక్రాంతి, రిపబ్లిక్‌డేల ప్రత్యేక సంచిక | వెల రు. | 5-00 |
| ఫిబ్రవరి నుండి మామూలు సంచిక | వెల రు. | 3-00 |
| జనవరి 1986 నుండి సంవత్సర చందా | రు. | 33-00 |

కన్సెషన్ : పాత చందాదారులు రెన్యూలు చేయదలుచుకున్నవారు, సరిక్రొత్తగా చందా దారులుగా చేరదలచుకున్నవారు డిశంబరు 1985 ఆఖరులోపు చెల్లించిన యెడల సంవత్సర చందా రు. 30-00 లు మాత్రమే.

**FREE GIFT :** డిశంబరు ఆఖరు లోపు రు. 30-00 లు చెల్లించినవారికి ప్రకాశంజిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శి డా॥ వెలగా వెంకటప్పయ్యగారు రచించిన "కనీస విజ్ఞానం" రు. 5-00 ఖరీదుగల పుస్తకం ఉచితం. ప్రతి ఇంట్లో వుండవలసిన విజ్ఞానదాయకమైన ఒక మంచి పుస్తకం.

ముఖ్య గమనిక : పాత చందా / క్రొత్త చందా వివరములు M. O. ఫారంలో వ్రాయవలెను. చందా అయిపోయిన వారికి శ్రీవాణి మీద తెలియబరుస్తూ స్టాంపు వేయబడును.

ఏజంట్లకు విజ్ఞప్తి : 1. డిశంబరు ఆఖరుకు బకాయిలు పూర్తిగా చెల్లించిన వారికి, మరియు కాపీకి రు. 5-00 లు డిపాజిట్ కట్టిన వారికి మాత్రమే జనవరి నుండి శ్రీవాణి పంపబడును. 2. 5 కాపీలు లోపు ఏజన్సీలు అంగీకరించబడవు. 3. UNSOLD కాపీలు తీసుకొనబడవు. 4. 1985 జనవరి, ఫిబ్రవరి, మార్చి సంచికలు ఎవరివద్దనైనా వుంటే ముందుగా లేఖ వ్రాసి సమాధానం యిచ్చిన తరువాత పంపవచ్చును. వాటి వెల యివ్వగలము.

ప్రకటనదార్లకు విజ్ఞప్తి : ప్రకటనలు డిశంబరు 15 లోపు పంప ప్రార్థన.

రచయితలకు విజ్ఞప్తి : రచనలు (కథలు, కవితలు, వ్యాసములు, కథానికలు) డిశంబరు 15 లోపు పంప ప్రార్థన.

శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవము : ది 11-1-1986 శనివారం సాయంత్రం గం 5-55 ని. మచిలీపట్నంలో జరుగును. ఈ ప్రకటననే ఆహ్వానముగా భావించి విచ్చేయ ప్రార్థన.

# అందరికీ నమస్కరించి.....

సహృదయులు అందించిన సహకారంతో శ్రీవాణిని సకాలంలో క్రమం తప్పకుండా ప్రతినెలా పాఠకులకు ఇప్పటివరకు అందజేయగలిగాను. అయితే ఈ సంవత్సరం 'శ్రీవాణి' కోసం షుమారు రు. 15 వేలు దాకా అప్పు చేయవలసి వచ్చింది. ఈ రోజులలో 'శ్రీవాణి' లాంటి వున్నత ఆశయ ఆదర్శములుగల పత్రికలు నడపడం బహు కష్టం. ఎల్లో జర్నలిజం, సెక్స్ సాహిత్యం, అర్ధనగ్న దృశ్యాలు, సినిమా సాహిత్యం, అశ్లీల సాహిత్య పత్రికలకు వున్న డిమాండ్ సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా పత్రికలకు లేదు.



'శ్రీవాణి' ఆరంభించినప్పటి నుంచి అనేకమంది రచయితలకు, పెద్దలకు కాంప్లిమెంటరీ కాపీలు పంపుతున్నాను. ఎప్పుడో ఒకప్పుడు సంవత్సర చందాగాని, జీవిత చందాగాని, విరాళంగాని పంపక పోతారా ? అనే ధీమాతో, నమ్మకంతో అనేకమంది స్నేహితులకు, ఆత్మీయులకు కూడా 'శ్రీవాణి' ని పంపుతున్నాను. ఈ విధముగా షుమారు వేయిమంది పెద్దలకు 'శ్రీవాణి' నేటివరకు వుచితంగా పంపబడుతున్నది. అయితే పై వారిలో కొంతమంది అడుగకుండానే తమ అమూల్యమైన రచనలు పంపి సహకరిస్తున్నారు. కృతజ్ఞతలు, ప్రశంసలు కొంతమంది తెలియజేసారు. వ్యక్తిగతంగా కలిసి అభినందించారు. సంవత్సర చందాలు పంపారు కొందరు. జీవిత సభ్యులుగా చేరారు మరికొంతమంది ఉదారులు. కొందరు అడ్వర్టైజ్‌మెంట్స్ ద్వారా సహకారం అందించారు. సంవత్సరం నుండి ఉచితంగా పంపుతున్నా కనీసం కృతజ్ఞతలు కూడా తెలియపరచనివారు కూడా వున్నారు. అందరికీ నా కృతజ్ఞతాభివందనాలు. సహకారం అందించిన వారికి కృతజ్ఞతలు తెలియజేయడం సహజం. అయితే నేను సహకారం అందించనివారికి కూడా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఎందువలనంటే వారికి కూడా ఏదో ఒకరోజున సద్బుద్ధి కలిగి శ్రీవాణికి సహకారం అందిస్తారనే విశ్వాసం నాకు వున్నది.

ధనమే నా జీవిత పరమావధి కాదు. పత్రికా నిర్వహణలో అనేక కష్టాలున్నాయని తెలిసి కూడా ఈ సాహసం చేసాను. జీవితంలో ఏదో ఒక మంచిపని చేయాలనే పట్టుదలతో 'శ్రీవాణి' ని ప్రారంభించాను. దీనిమీద డబ్బు సంపాదించాలనే కోరిక నాకు లేదు. అయితే నాలుగు కాలాలపాటు 'శ్రీవాణి' ఒక ఉత్తమ పత్రికగా నడపాలని నా ఆకాంక్ష. అప్పులలో పడితే అసలుకే మోసం వస్తుంది కదా ! సహృదయంతో పరిస్థితిని అర్థంచేసుకొని సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను.

ఒక మంచిపని చేసేటప్పుడు నలుగురు పెద్దలు "శభాష్" అంటే అతను ఆ పనిలోని కష్టములను సహితం మరచిపోయి ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు నడువగలుగుతాడు. అదే నేనుకూడా ఆశిస్తున్నాను. "ధనమూలం ఇదంజగత్" అన్నారుగదా అనుభవజ్ఞులు. శ్రీవాణి ప్రారంభించినప్పటి నుండి నేటివరకు న్యూస్‌ప్రింట్ రీముకు రు 20 లు పెరిగింది. ప్రభుత్వ కోటారేటు, బహిరంగ మార్కెట్ రేటుకు ఒక రీముకు రు 40 లు తేడా వున్నది. ప్రభుత్వం కోటా మంచి పత్రికలకు అంత త్వరగా లభించదు గదా !

ఇన్ని ఇబ్బందులున్నా 'శ్రీవాణి' ని సకాలంలో పాఠకులకు అందించగలిగాను. భవిష్యత్తులో కూడా అందించగలుగుతాననే నమ్మకం వున్నది. మన రాష్ట్ర పరిధులను దాటి, ఇతర రాష్ట్రములలో 42 కేంద్రములకు శ్రీవాణి వెళ్ళుతున్నది. ప్రవాసాంధ్రుల సహకారం బాగా అందుతున్నది.

( తరువాయి 55వ పేజీలో )

డిశంబరు - 1985

సంపుటి 1

సంచిక 12

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడి ప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 30-00

జీవిత సభ్యత్వం: రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS

MACHILIPATNAM

## విషయసూచిక

# సంపాదకీ

## పోలీస్, ప్రెస్ బిల్లులు

పోలీస్ బిల్లుతో ప్రజలను " ప్రెస " చేయాలనుకోవడం, ప్రెస్ బిల్లు పేరుతో పత్రికలను ' క్రష్ ' చేయాలనుకోవడం వట్టి అవివేకం. ప్రపంచ చరిత్రను పరికిస్తే ఇటువంటి అక్రమ చట్టాలకు ఎటువంటి గతి పట్టిందో తెలుస్తుంది. రౌలట్ చట్టాలు లాంటి అక్రమ, అమానుష చట్టాలు కూడా ప్రజా ఉద్యమాలను అణచలేకపోయినాయి. మన దేశంలో ఎమర్జన్సీని పెట్టి శ్రీమతి గాంధీ తగిన శాస్తిని అనుభవించింది. పోలీస్ జులుంతోను, మరియు పత్రికల నోళ్ళు నొక్కి ఏ ప్రభుత్వం ఎక్కువ కాలం పరిపాలించలేదనే విషయం చరిత్ర చాటుతున్నది.

ఈ సందర్భమున ప్రభుత్వాధినేతలు గమనించవలసిన ఒక ముఖ్య సంఘటనను వివరిస్తాను. పండిత నెహ్రూ ప్రధాన మంత్రిగా వున్నప్పుడు, ఆయన మంత్రివర్గంలో దేశీయాంగ మంత్రి జి. యల్. నందా వుండేవారు. ఆయన ఒక పర్యాయం పి. డి. యాక్ట్ ( Preventive Detention Act ) గడువు పెంచమని నెహ్రూగారిని కోరారు. అప్పుడు నెహ్రూ " Why are you afraid to put the men on trial ? అని ప్రశ్నించారట్ గారికి ప్రజాస్వామ్యం యెడల, స్వేచ్ఛా స్వాతంత్ర్యముల యెడల, న్యాయసూత్రాలమీద ఎటువంటి వున్నతమైన గౌరవ భావం వుండేదో ఈ సంఘటన తెలుపుతున్నది.

భారతదేశంలో సువ్యవస్థితమైన, సుపరిపాలన, న్యాయబద్ధంగా జరగడానికి వీలుగా మన ప్రజాస్వామ్య వ్యవస్థను రాజ్యాంగ నిర్మాతలు మూడు భాగాలు చేసారు. 1. రాజ్యాంగంలో నిర్దేశించిన నియమ నిబంధనల ననుసరించి న్యాయసమ్మతమైన చట్టాలు చేసే బాధ్యత పార్లమెంటుది, శాసనసభలది ( Legislatures ). 2. ఆ చట్టములను అమలుపరచే బాధ్యత ప్రభుత్వ యంత్రాంగము ( Executive ) నకు యిచ్చారు. 3. అట్టి చట్టములు రాజ్యాంగ బద్ధంగా రూపొందించబడినవా ? లేదా ? మరియు వాటిని సక్రమంగా అమలుపరుస్తున్నారా ? లేదా ? చూచే బాధ్యతను న్యాయస్థానముల ( Judiciary ) కు వప్పగించారు.

" లా కమీషన్ల సూచన మేరకు 1973 లో క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను సవరించి ఎగ్జిక్యూటివ్, జుడిషియల్, మెజిస్ట్రేరియల్ విభాగాలను విభజించడం జరిగింది. అయితే ఈ రాబోవు పోలీసు బిల్లులో పోలీస్ కమీషనర్‌కు జుడిషియల్ అధికారాలు గూడా యివ్వడం వలన జడ్జి, పబ్లిక్ ప్రాసిక్యూటర్, ప్రతివాది తరపు న్యాయవాది, సాక్షులు తదితర పాత్రలన్నీ కమీషనర్లే ధరించి తీర్పు యివ్వడం జరుగుతుందని, ఈ విధానం వలన న్యాయ వ్యవస్థపట్ల ప్రజలకు నమ్మకం పోవడమే కాక పోలీసులకు విలువ తగ్గిపోతుంది " అని సిక్కిమ్ అడ్వకేట్ జనరల్ శ్రీ వేదుల జగన్నాథరావు విజయవాడ అభిహితంగా సభలో చెప్పిన విషయాలను రాష్ట్ర ప్రభుత్వం విజ్ఞతతో స్వీకరించాలి.

పోలీస్ కమీషనర్‌కు మెజిస్ట్రేరియల్ అధికారాలు, ఎమర్జన్సీ విధించే అధికారాలు, పౌరుని బహిష్కరించే అసాధారణ అధికారాలు యివ్వడం మరియు న్యాయం కోసం కోర్టులో కూడా ప్రశ్నించడానికి వీలులేని అధికారాలు బిల్లులో చోటుచేసుకోవడం ఏ మాత్రం సమంజసం కాదు. ఇటువంటి బిల్లు నియంతృత్వానికి సోపాన మవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ పోలీసు బిల్లు వలన ఒకే వ్యక్తి ( పోలీస్ కమీషనర్ ) బహు పాత్రాభినయం చేయడానికి అవకాశం ఏర్పడుతుంది. ఇది సినిమాలలో చూడటానికి బాగుంటే బాగుండవచ్చునేమోగాని నిత్యజీవితంలో

( తరువాయి 55వ పేజీలో )

# అమృతవాణి

కూచిభట్ల చంద్రశేఖరశర్మ

శ్లో. శబ్దాదిభిః పంచభిరేవ పంచ
పంచత్వ మాపుః స్వగుణేన బద్ధాః
కురంగ మాతంగ పతంగ మీన
ంగాః; నరః పంచభి రంచితః కిమ్?

శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం యీ అయిదింటినీ విషయాలంటారు. ఇవి ఆకాశాది పంచ భూతాల గుణాలు. ఈ పంచ విషయాలవల్ల ప్రాణులకు ఎంతో సుఖం కలుగుతున్నట్లు కనబడుతుంది. ప్రతి వాళ్ళూ సుఖం కావాలనే కోరుకుంటారు కనుక యీ విషయాలమీద ఆసక్తిని బాగా చూపించటంలో ఆశ్చర్యపడక్కర్లేదు. అయితే యీ సుఖం వట్టి ఆభాసేగాని నిజం కాదు. గొప్ప ఆకర్షణ శక్తి యీ శబ్దాది విషయాల్లో వుండటంచేత ప్రాణికోటి సుఖ భ్రాంతిలో పడిపోయి తమ ప్రాణాలకే ముప్పు తెచ్చుకొంటున్నది.

అడవిలో స్వేచ్ఛగా తిరిగే లేళ్ళకు ప్రాణ హాని కలిగించేది యీ శబ్దమనే విషయమే. కిరాతులు వీటిని పట్టుకోటానికి పిల్లనగ్రోవి లాంటి వాద్యాలని చక్కగా వూదుతారు. ఆ ధ్వని చెవులు రిక్కించి వింటూ లేళ్ళు ఒళ్ళు మరచిపోతాయి. అప్పుడే అమాంతం పట్టేస్తారు కిరాతులు. లేళ్ళకు శ్రోత్రేంద్రియం మిగిలినవాటి కంటె చురుగ్గా పనిచేస్తుంది. అది శబ్దానికి లొంగి వాటి ప్రాణానికే హాని కలిగిస్తుంది. ఇలాగే యేనుగులున్నాయంటే అవి ఆడ యేనుగుల శరీర స్పర్శను కోరుకుంటూంటాయి. అది గ్రహించిన వేటగాళ్ళు ఆడ యేనుగుల్ని మగవాటికి చూపిస్తారు. దారిలో పెద్ద గుంటతవ్వి ఆకులు అలములతో కప్పేస్తారు. ఎదురుగా వున్న ఆడ యేనుగును స్పృశించి సుఖించాలనే తమకంలో వచ్చే మగ యేనుగు ఆ గుంటలోపడి వేటగాళ్ళకు చిక్కుతుంది. దీని త్వగింద్రియం స్పర్శ విషయాసక్తం కావటమే యీ ప్రమాదానికి కారణం.

ఇక రూపమనే విషయం తేజస్సుకు సంబంధించింది. మిడుత అగ్ని యొక్క రూపం చూచి ఆనందపడుతుంది. దాని చక్షురింద్రియం మంచి శక్తి కలది కావటంతో అమాయికంగా అగ్ని రూపానికి ఆకర్షింపబడి అమాంతం అగ్నిలో దూకి మాడిపోతుంది పాపం!

ఇదే విధంగా నీళ్ళలో సంచరించే చేప కూడా రసనేంద్రియ లోలత్వంతో రస విషయాకృష్టమై నశించిపోతోంది. దానికి ప్రతిదీ రుచి చూచుకొంటూ పోవటం స్వభావం. అలాగే గేలానికున్న ఎఱను కూడా రుచి చూచి మింగుతుంది. వెంటనే గేలాం ముల్లు దాని గొంతులో గుచ్చుకొని దాని ప్రాణం తీస్తుంది. ఇక్కడ రసమనే విషయం దీనికి ప్రాణాంతకమైంది.

గంధం అనే విషయం అంటే వాసన అనేది వెంటనే ముక్కుకు తగులుతుంది. ఘ్రాణేంద్రియం వాసన చేత ఆకర్షింపబడుతుందన్నమాట. ఈ విషయంలో బలహీనత తుమ్మెదలకుంది. అయితే సంపంగిపూల వాసన తుమ్మెదలకు పడదు. తల దిమ్మెక్కిపోతుంది. అది వాటికి మత్తుపదార్థం లాంటిది. అయినా ఆ వాసనమీద ప్రీతితో తుమ్మెద వాలుతుంది. సంపంగి విషయం తెలిసి తెలిసి ఆ గంధానికి ఆకర్షింపబడి తుమ్మెద తన ప్రాణంమీదికి తెచ్చుకొంటుంది.

ఈ విధంగా శబ్దాది విషయాలు ఆయా యింద్రియాలనాకర్షించటంచేత లేళ్ళు, ఏనుగులు, మిడుతలు, చేపలు, తుమ్మెదలు తమ ప్రాణాలు ఎలా పోగొట్టుకొంటున్నాయో అర్థమైంది. వీటిల్లో ఒక్కొక్కటి ఒక్క యింద్రియ శక్తితోనే ఒక్క విషయాన్నే ఆశించి నశించిపోతూంటే అయిదు ఇంద్రియాల శక్తిగల మనిషి శబ్దాది పంచ విషయాలకు ఆకర్షింపబడి యేమైపోతాడో గమనించాలి.

కనుకనే మనిషి యింద్రియ తృప్తికి విషయాసక్తుడు కాకుండా వుండటానికి సర్వదా ప్రయత్నించాలి.

"బలవా నింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" ●

# గీతా సందేశము

వసుదేవ సుతం దేవం కంస చాణూర మర్దనం
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం ॥

మత్స్య కూర్మ వరాహాది దశావతారాల్లో శ్రీకృష్ణ పరమాత్మకు మాత్రమే జగద్గురువను పేరు కలదు. ఆ పేరు గీతా సందేశం వల్లనే వచ్చింది. శంకర భగవత్పాదులు "తదిదం గీతా శాస్త్రం సమస్త వేదార్థ సార సంగ్రహ భూతం భూతాను జిఘృక్షయా అర్జునాయ శోక మోహ మహోదధౌ నిమగ్నాయ భగవాన్ వాసుదేవః ఉపదిదేశ" సర్వ వేద సారభూతమైన యీ గీతా శాస్త్రమును సకల లోక జనుల నుద్ధరింపదలచి శోక మోహ సముద్రములో మునిగిన అర్జునునకు భగవంతుడుపదేశించెనని గీతా భాష్య రచనారంభములో సూచించిరి. 'Bhagavadgeeta is a universal serveture' భగవద్గీత విశ్వ మానవ దివ్య సందేశము వంటిదని వివేకానందుడు హెచ్చరించెను.

మన ఆర్ష వాఙ్మయంలో వశిష్ఠ గీత, అష్టావక్ర గీత, శివ గీత, దేవీ గీత మొదలగు గీతలు మొదలగునవి చాల గలవు. అవన్ని ఆ ప్రవోధకుల పేర్లతో ప్రపంచంలో ప్రఖ్యాతి చెందినాయి కాని శ్రీకృష్ణపరమాత్మ బోధించిన గీతకు శ్రీకృష్ణ గీత అని పేరు రాకుండ 'భగవద్గీత' అని పేరు రావడంలోనే ఆ ప్రవోధములోని విశిష్టత, పవిత్రత, సార్వజనీనత స్పష్టమగుచున్నది. 'కృష్ణస్తు భగవాన్ స్వయం' కృష్ణుడు మాత్రం సాక్షాత్ భగవంతుడనడంలో కేవలం దేవకీ పుత్రుడుగా కన్పడుతున్నా జనన మరణములు లేని షడ్గుణైశ్వర్య సంపన్నుడు నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడైన పరమాత్మయే అని మనం భావించాలి. అన్ని వర్గాలకు, అన్ని దేశాలకు అన్ని మతాలకు అన్ని కులాలకు సంబంధించిన సార్వకాలిక సార్వజనికమైన దివ్య సందేశమే గీతా ప్రబోధము.

నిత్య జీవితంలో మానవులకు సంభవించే పలు సమస్యలకు గీతా సందేశం చక్కని పరిష్కారం. వివిధములైన పెక్కు సందేహములకు నిర్దుష్టమైన నిర్దిష్ట సమాధాన సూచకం. విషాదం కల అర్జునునకే గాక విషాదం సంభవించే విశ్వజనానికి కర్తవ్య బోధకమే గీతా సందేశం.

## మల్లాప్రగడ శ్రీరంగారావు

భగవద్గీతాభవ్య భవనానికి పునాది విషాదయోగమే. విషాదం మానవ భవిష్యత్ సౌధానికి దివ్య సోపానమని పెద్దల సూక్తి. మనకు కలిగే విషాదాలు రోగాలవుతాయి. కాని అర్జునుని అదృష్టంవల్ల, భగవంతుని ప్రబోధం వల్ల ఆయన విషాదం, యోగం అయింది. ధర్మాన్నుండి భ్రష్టుడనౌతున్నాననే విషాదం, స్వర్గ లోకంలోని పితృదేవతలు పతితులౌతారనే విషాదం, గురువైన ద్రోణాచార్యులను సంహరించి పాపం మూటకట్టుకోవలసి వచ్చిందనే విషాదం. అందుకే ధర్మానికి పుణ్యానికి న్యాయానికి దూరమౌతున్నాననే అర్జునుని విషాదం యోగమై మోక్ష ద్వారమైంది.

ప్రపంచంలో సామాన్య మానవుడు భార్యా పుత్రుల కొరకు, ఆరోగ్య భాగ్యాల కొరకు, కీర్తి ప్రతిష్ఠల కొరకు గుట్టుగానో గట్టిగానో ఏడుస్తూనే వుంటాడు. 'లోకం శోకహతంచ సమస్తం. అని శంకరులన్నారు. భగవంతుని మెప్పించేది కన్నీరుగాని పన్నీరు కాదు. అందుచే అర్జునుని దుఃఖానికి (విషాదానికి) కరిగిపోయి శ్రీకృష్ణ పరమాత్మ జీవిత పరమార్థాన్ని బోధించి కర్తవ్యోన్ముఖుని గావించాడు.

నరుడైన అర్జునుడు నరజాతికి ప్రతినిధి. నరునికి నారాయణుడు చేసిన ప్రబోధము నరనారీ జనానికి సంబంధించినదే.

కౌరవులతో యుద్ధము చేయుటకై రణరంగమున అడుగుపెట్టిన అర్జునుడు —

"సేన యోరుభ యోర రథం
స్థాపయ మేఽచ్యుత
యావదేతా న్నిరీక్షేహం యోద్ధుకామా
నవస్థితాన్"

"ఓ అచ్యుతా నాతో యుద్ధము చేయు తలంపుతో వచ్చిన వారిని చూచుట కనువుగ ఉభయసేనల మధ్య భాగమున రథమును నిల్పుమ''ని శ్రీకృష్ణునితో పలుకునపుడు అర్జునునిలో అహంకారము ప్రవేశించింది. తాను యుద్ధముచేయు మహావీరుడనని భావించి శ్రీ కృష్ణుని పరమాత్మగా భావింపక తన ఆజ్ఞను పాలించువానిగ తలచి రథమును నిల్పుమని శాసించాడు. సేనల మధ్యభాగమునకు రథమును పోనిచ్చిన పిమ్మట తన కెదురుగ నిలబడి తనతో పోర దలచిన ఆచార్యులు, భ్రాతలు, మిత్రులు మేనమామలు, పుత్రులు పౌత్రులు మున్నగు వారిని చూచి వారిపై గల అభిమానముచే వారందరు తన వారనే మమకార భావంతో

"న కాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ
కింనో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేనవా ॥

'కృష్ణా! నాకు విజయము, రాజ్యము సుఖాలు అక్కర లేదు. ఈ రాజ్యభోగాలతో కూడిన జీవితం నాకు వద్దు' అని పలుకుచు చివరకు గాండీవమును విడిచిపెట్టి రథములో చతికిలపడిపోయినాడు.

ఈ విధంగా పార్థునిలో అహంకార మమకారాలు ప్రవేశించుటచే కర్తవ్యాన్ని మరచి యుద్ధము చేయను, బిచ్చమైనా ఎత్తుతాను, చావనైనా చస్తానుగాని, స్వజనుల చంపి నేను సుఖపడేదేమున్నది? కులక్షయము ధర్మనాశనము తప్ప యుద్ధం వల్ల నాకు కలిగే ప్రయోజనమేమీలేద'ని వ్యామోహితుడైనాడు. క్షత్రియుడైన తనకు యుద్ధము అధర్మంగా తోచింది. పాపకార్య మనిపించింది. ఇదంతా అతనిలోని అహంకార మమకారాల ఫలమే. వదలవలసిన అహంకారాన్ని పట్టుకొని పట్టుకోవలసిన గాండీవాన్ని వదలిపెట్టాడు. అకారణంగా అర్జునునిలో దయ్యం ఆవేశించినట్లు తన కెదురుగా యుద్ధంచేయు వారిపై దయాభావం ఆవేశించింది. "కృపయాపర యావిష్టో విషీదన్నిద మ బ్రవీత్" అపారమైన దయ ఆవేశించి దుఃఖిస్తూ పార్థుడు పలికెనని యీ శ్లోకార్థభావం.

"అగ్నిదో గరదశ్చేవ క్షేత్ర విత్తాపహారకౌ
మిత్రద్రోహీ కృతఘ్నశ్చ షడేతే ఆతతాయినః"

ఇంటికి నిప్పంటించినవాడు, విషం పెట్టినవాడు, భార్యను పరాభవించినవాడు, రాజ్యము నపహరించినవాడు, మిత్రద్రోహి, జేసిన మేలు మరచినవాడు, యీ ఆరుగురుని ఆతతాయులంటారు. ఇట్టి వారిపై దయచూడక వెంటనే వారిని సంహరించాలని నీతిశాస్త్రం - ధర్మశాస్త్రం బోధిస్తున్నది. ఈ ఆరు విధముల నేరాలు చేసిన కౌరవులపై అర్జునునికి దయ కలిగిందంటే మమకారమే హేతువు. ఆ మమకారమే అతనిని కర్మభ్రష్టుని చేసింది. అట్టి వానిని కర్మవీరుని చేయుటకై పరమాత్మ ప్రబోధ మవసరమైంది.

మానవుడెన్నడు నిరుత్సాహంతో అధైర్య పడరాదు. హృదయ దౌర్బల్యం నిర్వీర్యుణ్ణి చేస్తుంది. నీచమైన పిరికితనం మన్నుతిన్న పాములె స్తబ్దత కలిగిస్తుంది. తన భక్తుడైన పార్థునిలో ప్రవేశించిన అహంకార మమకార జన్యమైన దౌర్బల్యం గుర్తించి పరమాత్మ —

"క్లైబ్యంమాస్మ గమః పార్థ! నైతత్త్వయ్యుప
పద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ
పరంతప!"

పరులను తపింపచేసే ఓ అర్జునా! నిర్వీర్యుడవు కాకుము, ఎన్నో ఘన విజయాలను సాధించిన నీకీ పిరికితన మేమిటి! క్షుద్రమైన యీ హృదయ దుర్బలత్వమును విడిచి లెమ్మని హెచ్చరించాడు. అంతేకాక అర్జునునిలో కలిగిన మానసిక దౌర్బల్యానికి మూల కారణం గ్రహించిన మాధవుడు యదార్థ తత్త్వమును వివరింపదలచాడు. 'నిదానే

మాధవః శ్రేష్ఠః' రోగము యొక్క మూల కారణమును తెలిసికొనుటలో మాధవుడు శ్రేష్ఠుడు. 'మాధవ నిదాన' గ్రంధకర్త రోగానికి కాదు మందిచ్చేది. రోగ కారణానికి మందివ్వాలని. ఆ విధమైన చికిత్స వల్ల మళ్ళీ ఆ రోగం వచ్చే అవకాశం లేదని స్పష్టం చేసాడు. ఆ గ్రంధకర్తయైన మాధవాచార్యులు రోగ నిదానశ్రేష్ఠుడు, మాధవుడైన శ్రీకృష్ణుడు అర్జునుని మోహ రోగానికి మూలం తెలిసిన మహా వైద్యుడు కనుక —



"అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే
గతాసూన గతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ॥

ఎవరికై దుఃఖించాలో ఎవరి కొఱకు దుఃఖింపరాదో తెలియక నా వాళ్ళనే మోహంలోపడి తెలిసినవాని వలె పలుకుచున్నావు. వివేకవంతులు మరణించినవారికై గాని బ్రతికిన వారి కొరకు గాని దుఃఖింపరు. ఈ లోకంలో ప్రతి వ్యక్తి తాను చేసిన శుభా శుభ కర్మఫలాలను అనుభవిస్తూ వుంటాడు. నీవు దుఃఖపడినంత మాత్రాన వారి సుఖ దుఃఖాలలో మార్పు రాదు. వాళ్ళంతా నా వాళ్ళు అంటున్నావు. అందుకే నీ కీ దుఃఖం. మరణం దుఃఖానికి కారణం కాదు. మరణించినవారి యందున్న మమకారమే దుఃఖ హేతువు. మమకారం వదిలితే దుఃఖం వుండదు. అద్దె యింట్లో నివసించేవాడికి ఆ యిల్లు పడిపోయినా దుఃఖం రాదు. ఆ యిల్లు తనదనే భావం లేకపోవడమే కారణం. నిర్మమో భవ ।

అర్జునా ! ఇంతకు మరణమంటే మార్పేకాని నాశనం కాదయ్యా ! బాల్యం పోయి యౌవనం, ఆ యౌవనం పోయి వార్ధక్యం మనకు వస్తున్నాయి కదా ! బాల్య యౌవనాలు పోయినాయని దుఃఖిస్తున్నామా ! అవి వచ్చి పోయేవని మన అనుభవంలో చూస్తున్నాం గనుక దుఃఖం రావడం లేదు. అట్లాగే యీ దేహం పోయి మరొక్క దేహం వస్తున్నప్పుడు దుఃఖింపవలసిన అవసరంలేదు. బుద్ధిమంతుడు యీ నిజం తెలుసుకొని దుఃఖింపడు.

శరీరమంటేనే నశించిపోయేదని అర్థం. నశించే శరీరం మీద వ్యామోహం దుఃఖ హేతువు. బాల్య యౌవన వార్ధక్యాలు మారినా, వాటిని చూస్తూ అన్ని అవస్థల్లోనూ సాక్షిగా వుండే జీవుడున్నాడు. వానికి నాశనం లేదు. అట్లే శరీరం నశించినా శరీరంలోని ఆత్మకు వినాశం లేదు. శాశ్వతమైన ఆత్మకు నశించే శరీరంతో కొంతకాలం సంబంధం కలిగి వుండడమే జీవితమని ఆ సంబంధం నిత్యం కాదని తెలుసుకో అర్జునా !

"అన్తవన్త ఇమే దేహాః నిత్యస్యోక్తాః శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వభారత ॥

అని శరీరమునకు ఆత్మకుగల సంబంధాన్ని వివరించి, శరీరమే ఆత్మయని భావించినందున శరీరంతో పాటు ఆత్మ కూడ నశిస్తుందన్న తలంపే దుఃఖ హేతువు. కావున యుద్ధమునకు సిద్ధము కమ్మని బోధించాడు. మరియు స్వధర్మాచరణంలో మరణించినా మంచిదే కాని పరధర్మం ఆశ్రయించరాదు. పరుని యింట పాయసం త్రాగడం కంటె తన యింట గంజి త్రాగడం మంచిది. అందుచే పార్థా ! క్షత్రియజాతిలో పుట్టిన నీవు దుష్టులైన

## అనుబంధం

రంగు రంగుల పూవులోయ్
కమ్మ కమ్మని తావులోయ్
వన్నె వన్నెల చిలుకలోయ్
సీతాకోక చిలుకలోయ్ ॥

అందమంటే వానిదే ;
స్నేహమంటే వానిదే
పువ్వులందం చెట్లపైనా ;
'చిలుక' లందం పూలపైనా ॥

తియ్యని తేనెల సారం
చిలుకకు ప్రాణాధారం ;
పువ్వు చూపు ఆదరణం
పూజాతికి విస్తరణం ॥

పువ్వు లేదో చిలుక లేదు,
చిలుక లేదో పువ్వు లేదు ;
పూ, చిలుకల సంబంధం
యుగయుగాల అనుబంధం ॥

— కస్తూరి నరసింహమూర్తి

శత్రువులను సంహరించుట ధర్మమే కాని పాపం కాదు. "భైక్ష్య మపీహలోకె" ఈ లోకంలో ముష్టి యెత్తుకొని జీవిస్తాను కాని యుద్ధం చేయనని పలుకుట క్షత్రియుడవైన నీకు ధర్మం కాదు. స్వధర్మమైన యుద్ధాన్ని విడిచి పరధర్మమైన భిక్షాటనం నీకు పాపహేతువు "ధర్మ్యాద్ధి యుద్ధాత్ శ్రేయోన్యత్ క్షత్రియస్య నవిద్యతే" యుద్ధా చరణము కంటె మరియొక ధర్మం నీకు లేదని ప్రబోధించాడు. అంతేగాక కర్మ చేయకుండ తప్పించుకొనుటకు శక్యం కాదని, ప్రతివ్యక్తి కర్మచేసి తీరాలని, కర్మఫల దృష్టి వదలి భగవంతునిపై భారంవేసి నీ కర్తవ్యం నువ్వు పాటించాలని కర్మయోగాన్ని అర్జునునికి వివరించి స్వార్థ కర్మ బంధ హేతువని నిష్కామకర్మ మోక్ష హేతువని కర్మఫల సన్యాసములోని పరమార్థమును వెల్లడించెను.

పరమాత్మ ప్రబోధమును శ్రద్ధగ విన్న అర్జునుడు "నా మోహము నశించెను. కర్తవ్యము గుర్తుకు వచ్చినది. నీ అనుగ్రహముచే యదార్థము తెలిసికొంటిని. ఇపుడు నీవు చెప్పినట్లు చేసెదను." "నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాత్ మయాఽచ్యుత" "కరిష్యే వచనం తవ" అని పలికి గాండీవమును చేతబట్టి కర్తవ్యోన్ముఖుడయ్యెను. ఈ విధంగా అర్జునుని అడ్డుగా పెట్టుకొని బోధించిన గీతా సందేశం మనందరికి అవసరమే.

పిరికితనం విడిచిపెట్టు. స్వధర్మాన్ని ఆచరించు. కర్మలు మాత్రం చేస్తూ వాటి ఫలాన్ని ఆశించకు. దైవముపై భారం వేసి నిమిత్తమాత్రుడవై నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు ఆత్మ నిత్యము. శరీరము అనిత్యము. ఇతరుల సుఖదుఃఖాలకు మరొకడు కారకుడుకాడు. ఎవడు చేసిన కర్మఫలము వాడనుభవింప వలసినదే. తెలియనివాడు శ్రద్ధ లేనివాడు, సంశయగ్రస్తుడు దేనిని సాధించలేడు. కార్యాకార్యములందు శాస్త్రమే ప్రమాణము. భగవంతుని యందు భక్తి, కర్మలయందు శ్రద్ధ, ప్రాణులయందు దయ కలిగివుండాలి. శ్రీకృష్ణుడర్జునునికి బోధించిన గీతా సందేశ సారమిదియే. ★

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం
- వల్లభాచార్యులు

గేయం గీతానామ సహస్రం
- ఆదిశంకరాచార్య

# నైతిక, ఆధ్యాత్మిక శీల సంపత్తులను ఇనుమడింపజేసేదే సరైన విద్య

జాతీయ స్థాయిలో కేంద్రప్రభుత్వం రూపొందించ మున్న క్రొత్త విద్యా విధానానికి అవసరమైన సలహాలు, సూచనలు ఇవ్వడానికి వీలుగా మన రాష్ట్ర ప్రభుత్వం ది 5-11-1985 న హైద్రాబాద్‌లో ఒక విద్యా సదస్సును నిర్వహించింది. ఆ సదస్సులో అనేకమంది మేధావులు పాల్గొని అనేక సూచనలు చేసారు. విద్యా విధాన స్వరూపాన్ని వివరిస్తూ ఒక శ్వేత పత్రమును సమర్పించ మని, విద్యామంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడ్ని, ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. ఆర్. ఆదేశించారు. శ్రవణ దృశ్య బోధనా పద్ధతిని ప్రవేశపెడుతున్నామని, స్వయం శక్తిపై జీవించే వృత్తి విద్యా పద్ధతిని అమలుపరుస్తున్నా మని ముఖ్యమంత్రిగారు వివరించారు. ఒకవైపు ఆధునిక ప్రపంచం విసురుతున్న సవాళ్ళను ఎదుర్కొనే విధంగా, మరొకవైపు విశిష్టమైన మన సంస్కృతీ సంప్రదాయాలకు విఘాతం కలిగించని రీతిలో బాలలను ఆదర్శ పౌరులుగా రూపుదిద్దే విధంగా విద్యా కార్యక్రమాలు రూపొందించాలని ప్రధానమంత్రి రాజీవ్‌గాంధి ఈమధ్య పేర్కొనినారు. మహాత్మాగాంధీగారి నుండి నేటివరకు అనేకమంది మహా నాయకులు విద్యా విధానంలో విప్లవాత్మకమైన మార్పులను కోరుతూనే వున్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో క్రొత్తగా వచ్చిన ప్రతి విద్యామంత్రి విద్యా విధానంలో మౌలికమైన మార్పులను తీసుకొని రావడం జరుగుతుందని స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి చెబుతునే వున్నారు. విద్యారంగంలో అనేక మార్పులు వచ్చాయి. యస్. యస్. యల్. సి., ఇంటర్‌మీడియేట్‌లకు స్వస్తి చెప్పారు. ఏడవ ఫారం పద్ధతి వచ్చింది. కొంతకాలం పి. యు. సి. అన్నారు. తరువాత 10 వ తరగతి, ఇంటర్ పద్ధతి వచ్చింది. రెండు సంవత్సరాల డిగ్రీ కోర్సు పూర్వం వుండేది. ఇప్పుడు మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సు వచ్చింది. ఓల్డు రెగ్యులేషన్, మాడిఫైడ్ రెగ్యులేషన్, న్యూ రెగ్యులేషన్, రివైజ్‌డ్ రెగ్యులేషన్—మొదలగు అనేక రకాల సిలబస్‌లు వచ్చాయి, పోయాయి. కొన్ని హైస్కూళ్ళలో వృత్తి విద్యా తరగతులు ప్రవేశపెట్టారు. వీవింగ్ మాష్టర్లు, క్రాఫ్ట్ మాష్టర్లు వచ్చారు. ప్రస్తుతం పాఠశాలలో వారికి చేతినిండా పనిలేదు " Idle man's Brain is Devil's Workshop " కదా! అదే విధంగా వున్నది చాలా పాఠశాలల్లో పరిస్థితి. Moral Classes పేరుకు వున్నాయి. సిలబస్ పుస్తకంలో దీనిని గురించి చాలా పేర్కొనబడింది. అయితే Moral Classes ను నడుపుతున్న పాఠశాలలు అసలు ఎన్ని వున్నాయి? దానిని సద్వినియోగం చేసుకొనే పాఠశాలలు అసలు వున్నాయా? వేళ్ళమీద లెఖ్కపెట్టవచ్చు. అదీ ప్రసుత పరిస్థితి.

కొమ్మగిరి కృష్ణమోహనరావు

## అశాంతి

నేడు అనేక విద్యాలయాలు అశాంతికి నిలయాలవు తున్నాయి. విద్యాలయాలు అశాంతికి గురికావడానికి విద్యార్థులే కారకులని సహజంగా చాలామంది భావిస్తూం టారు. ఇది ఏ మాత్రం వాస్తవం కాదు. దీనికి బాధ్యులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ యింకా అనేకమంది

" పాఠశాలలోను, కళాశాలలోను కూడా బోధన మాతృ భాష ద్వారానే జరగాలి. మాతృభాష ద్వారానే మానవుడు జీవితంలోని గంభీర అంశాలను నేర్చుకోగలడు. దేశం లోని పిల్లలందరూ ఆంగ్లం నేర్వలేరు. నేర్చుకున్న వారైనా తమ శక్తి సామర్థ్యాలు చాలా వరకు ఈ విదేశీ భాష కోసమే వినియోగించడంవల్ల స్వతంత్ర భావాల్ని అభివృద్ధి చేసుకోవడానికీ, స్వతంత్ర పరిశోధనల్ని వడపడానికీ జవసత్త్వ లుండవు. "

— రవీంద్రనాథ్ టాగూర్

వున్నారు. అసలు విషయాన్ని గురించి ఎవరూ పట్టించుకోవడంలేదు. శిష్యుల మనోభావాలు గురువులకు అంతు పట్టడం లేదు. గురువుల మాటలు శిష్యులు శిరసావహించడంలేదు. వీరుభయుల సాధక బాధకాలను పాలకవర్గం (Managements) పట్టించుకోవడంలేదు, పాలక వర్గం వారి యిబ్బందులను ప్రభుత్వం సానుభూతితో పరిశీలించడం లేదు. అసంతృప్తి చెందిన విద్యార్థులు అధ్యాపక వర్గం మీద అవిశ్వాసం ప్రకటిస్తున్నారు. విద్యార్థుల కోరికలను నేరవేర్చలేని నిస్సహాయులైన ఉపాధ్యాయులు పాలకవర్గం వారి మీద విరుచుక పడుతున్నారు. పాలక వర్గం వారు చేయగలిగేదేమీలేక తమ సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకుని వస్తున్నారు. వాటిని సకాలంలో సరైన రీతిలో ప్రభుత్వం పరిష్కరించ లేకపోతున్నది. విద్యార్థులు ఆగ్రహావేశపరు లవుతున్నారు ఈ అవకాశాన్ని కొంతమంది రాజకీయ నాయకులు తమ సంకుచిత స్వార్థ స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటున్నారు. విద్యార్థులు ఉద్రేకంతో రెచ్చిపోతున్నారు. మధ్యలో కొన్ని దుష్ట శక్తులు ప్రవేశిస్తున్నాయి అవాంఛనీయమైన సంఘటనలు జరుగుతున్నాయి. పోలీసులు రంగప్రవేశం చేసి తమ బలపరాక్రమాదులను ప్రదర్శిస్తున్నారు. ఉద్యమాలు తార స్థాయి నందుకుంటున్నాయి. విద్యాలయాలు రణరంగంగా మారుతున్నాయి. పోలీసుల తుపాకులకు అమాయకులైన విద్యార్థులు బలి అవుతున్నారు. పవిత్రములైన విద్యాలయాలు అశాంతికి ఆలవాలమై పోతున్నాయి విద్యాలయాలు మూతపడుతున్నాయి. విద్యార్థుల చదువులకు అవరోధం ఏర్పడుతున్నది.

" ఈ అశాంతికి, ఈ విషవలయానికి కారకులెవరు ? బాధ్యులెవరు ? " అనే ప్రశ్న అందరిని నేడు వేధిస్తున్నది. సునిశితంగా పరిశీలిస్తే ఏ ఒక్కరూ కాదు. అందరూ కూడాను.

## ఆత్మ పరిశీలన చేసుకోవాలి

ఇది ఒక జటిల సమస్య. అంత తేలికగా పరిష్కారం అయ్యేది కాదు. అయితే అసాధ్యమైనది మాత్రం కాదు. ఈనాటి బాలబాలికలను చక్కటి పౌరులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత ఎవరి మీద ఎంతవరకు వున్నదో నేడు పరిశీలించవలసిన అవసరం ఎంతయినా వున్నది. జన్మనిచ్చిన తల్లి మీద, పోషించి రక్షిస్తున్న తండ్రి మీద, బుద్ధి వికాసానికి తోడ్పడవలసిన గురువు మీద, విద్యాలయాలను నిర్వహిస్తున్న పాలకవర్గం మీద, దేశాన్ని తీర్చిదిద్దవలసిన రాజకీయ నాయకుల మీద, రచయితల మీద వున్నది. అంతేకాదు ఉత్తమ విద్యా విధానాన్ని రూపొందించవలసిన బాధ్యత ప్రధానంగా ప్రభుత్వం మీద వున్నది. వీరందరూ తమతమ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తున్నారా ? ఎవరికి వారు ఆత్మ పరిశీలన చేసుకోవాలి. తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి. ఇదే ఈనాటి ప్రధాన సమస్య.

## అసలు కారణాలు

విద్యార్థులలో అశాంతి చెలరేగడానికి ప్రధాన కారణాలు రెండు. 1. లోపభూయిష్ట విద్యా విధానం. 2. నీతిని

బోధించని విద్య. ఈ రెండు ప్రధాన కారణాలకు - తల్లి దండ్రులు, గురువులు, పాలకవర్గం, ప్రభుత్వం, రచయితలు - అందరూ బాధ్యులే. ఈ రెండు కారణాలను సవ్యంగా సరిదిద్దినప్పుడే విద్యార్థులు నిజమైన భావిభారత పౌరులుగా తీర్చిదిద్దబడతారు.

## లోప భూయిష్ట విద్యా విధానం

స్వాతంత్ర్యం వచ్చి 39 సంవత్సరములు అయినా బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన విద్యా విధానమును మార్చుకో లేకపోయినాం. వారు సృష్టించిన అవాస్తవికమైన చరిత్రను యిప్పటికీ మన పిల్లలకు పాఠశాలలో బోధించబడుతునే వున్నది. విద్య పరమావధి ఉద్యోగం చేయడమేననే భావం బ్రిటీష్‌వారు మనకు నేర్పి వెళ్ళారు. "ఇంగ్లీషు విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషు వాణ్ణిగా మార్చి వేస్తుంది ; రంగులో, రక్తంలో, ఊహలో — ఈ విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషువాణ్ణి చేస్తుంది." అని మెకాలే, ఆంగ్ల విద్యను భారతదేశంలో ప్రవేశ పెడుతూ చెప్పిన మాటలు యదార్థంగా ఋజువు చేయ బడ్డాయి. భావదాస్యం యిప్పటికీ పైదొలగలేదు. ఇస్త్రీ బట్టలు నలగకుండా, సున్నితమైన నాజూకైన, ఉద్యోగాలు చేస్తూ, ధనం సంపాదించి, సుఖవంతమైన, విలాసవంతమైన జీవితాలు గడపాలనే అభిప్రాయం యిప్పటికీ మన విద్యావంతులలో పాతుకొనిపోవడం కడుశోచనీయం. విద్య యొక్క పరమావధి ఉద్యోగం చేయడమే కాదు, విజ్ఞానమును సముపార్జించడం. ఈ భావం విద్యావంతులలో అవసరమైన స్థాయిలో కలుగకపోవడానికి కారణము లోప భూయిష్ట ప్రస్తుత విద్యా విధానమే. శాస్త్రీయ పద్ధతులలో విద్యా బోధన జరుగకపోవడం ; సాంకేతిక పరిజ్ఞానమును అవసరమైన స్థాయిలో పెంపొందించక పోవడం ; వున్నది కూడా వినియోగించుకోలేకపోవడం ; వృత్తి విద్యలకు అవసరమైన ప్రాధాన్యం యివ్వక పోవడం ; జీవితంలో తమ కాళ్ళమీద తాము నిలబడే శక్తిని, స్ఫూర్తిని యిచ్చేటటువంటి వాస్తవిక విద్యను

"విద్యా విధానంలో కూడా మౌలికమైన విప్లవం రావాలి. విద్యార్థులకు తమ కాళ్ళపై తాము నిలబడగలిగి, ఆత్మవిశ్వాసాన్ని పెంచే విద్య నేర్పాలి. కాని ఇప్పుడు "ఉద్యోగం! ఉద్యోగం!" అన్నదే విద్యగా వున్నది. మనం వ్యాపారులకుగాని, ప్రభుత్వానికిగాని దాసులమవ్వాల్సిన అవసరం లేదు. ఉత్పత్తిని పెంచి, దేశంలో సంఘీభావం పెంచడమే కావలసింది. కనుక ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి విద్యా విధానంలో విప్లవాత్మకమైన మార్పును తీసుకొని రావడానికి సమిష్టి కృషి చేయాలి."

— జయప్రకాశ్ నారాయణ్

గరపకపోవడం మొదలగునవి ప్రధాన కారణాలు. అంతే కాదు ఈ దేశంలో విద్య యిప్పటికీ యాంత్రికంగానే బోధించ బడుతున్నది. అందులో ఏ మాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని లేదు. తెలివితేటలను పెంపొందించడానికి గాని, వివేక విజ్ఞానాదులను కలుగజేయడానికిగాని ఉపయోగ పడదు. స్వశక్తిమీద జీవించడానికిగాని, సాంకేతిక పరిజ్ఞానమును సంపాదించడానికిగాని ఉపయోగపడటం లేదు. ఒకవేళ ఎవరైనా స్వప్రేరణతో, ధైర్యంగా ముందుకు వస్తే, అటువంటివారికి ఉత్సాహం, ప్రోత్సాహం, సహాయం అవసరమైన స్థాయిలో ప్రభుత్వం నుండి లభించడంలేదు. కుటీర, చిన్నతరహా పరిశ్రమలు నెలకొలిపి చేతులు కాల్చుకుంటున్నారు అనేకమంది. ముడిపదార్థం దొరికుతే మార్కెట్ వుండదు. మార్కెట్ వున్న వాటికి ముడిపదార్థం దొరకదు. ఈ రెండూ వున్న వాటికి సాంకేతిక పరిజ్ఞానం లభ్యంకాదు. అందువలన విద్యావంతులు గత్యంతరం లేక ఉద్యోగాల కోసం

> " వినయ వివేకాదులను వృద్ధి పొందించుట కనుకూలపడని విద్య లేకపోయినను దానివలన వచ్చెడి నష్టమేమియూ లేదు. సుగుణ సంపదను గడించుటకయి విద్య నేర్వ వలసినదేగాని, విద్యనిమిత్తమై సద్గుణములను విడువరాదు. పలువురు మూఢులైన నిరక్షర కుక్షులు చేరి చేయు హానికంటెను, ఒక చదువుకున్న దుష్టుడు చేయు హానియే అధికము. "
>
> కందుకూరి వీరేశలింగం పంతులు

" ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజి " ల చుట్టూ తిరుగుతున్నారు. ఉద్యోగాలు లభ్యంకావడంలేదు. చిట్టచివరికి నిరాశ చెంది, నిస్పృహకు లోనై కొంతమంది ఉద్యమాలను చేబడుతున్నారు. మరి కొంతమంది బలహీనులు ఆత్మహత్యలకు సహితం పాల్పడుతున్నారు. ఇది మారాలి. సమగ్ర విద్యా విధానం రూపొందాలి. అయితే ఇప్పుడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విషయంలో కొంత శ్రద్ధ చూపుతున్న మాట వాస్తవమే. వీరి ఆలోచనా సరళిలో కూడా కొంత మార్పు వచ్చింది. వృత్తి విద్యలకు ప్రాధాన్యత యివ్వ సంకల్పించుకోవడం ముదావహమే. వృత్తి విద్యలో ఉత్తీర్ణులైన విద్యావంతులు, ఆ యా వృత్తులలో పరిశ్రమలను నెలకొల్పడానికి అవసరమైన సహకారం, ప్రోత్సాహం ప్రభుత్వమే అందివ్వాలి. ముడిపదార్థముల విషయంలోను, మార్కెటింగ్ విషయంలోను ప్రభుత్వం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలి. బ్యాంకులు, ప్రభుత్వ ధన సహాయక సంస్థల నుండి తేలిక పద్ధతుల ద్వారా ఋణ సహాయం లభించేట్లు చూడాలి. ఆ విధంగా చేసినప్పుడు మాత్రమే వృత్తి విద్యా కోర్సుల వలన ప్రయోజనం కలుగుతుంది. ప్రభుత్వోద్యోగాలకు వత్తిడి తగ్గుతుంది. తద్వారా ప్రభుత్వానికి కొంత భారం తగ్గుతుంది. ఉత్పత్తి పెరుగుతుంది. ఈరోజున వృత్తి విద్యా కోర్సులో చేరే విద్యార్థి, చదువు పూర్తిచేసిన తరువాత ఆ వృత్తికి సంబంధించిన పరిశ్రమ నెలకొల్పేంత వరకు ప్రభుత్వమే అవసరమైన శ్రద్ధను తీసుకోవాలి. అది చేయకుండా వృత్తి విద్యా కోర్సులను పాఠశాలలో ప్రవేశపెట్టినంత మాత్రాన ప్రయోజనంలేదు.

## నీతిని బోధించని విద్య

చాలా విద్యాలయాలలో ప్రతి సంవత్సరం వార్షికోత్సవాలు జరగడం పరిపాటి. ఆ సభలలో " నేటి బాలబాలికలే రేపటి పౌరులు " అని పెద్దలు ఉపన్యాసాలు దంచి వెళ్ళిపోతుంటారు. తదనంతరం వినోద కార్యక్రమాలు భారీ ఎత్తున జరుగుతాయి. వాటిని చూచి సంతోషించి తల్లిదండ్రులు ఇండ్లకు వెళ్ళిపోతారు. ఉత్సవాలను ఘనంగా జరిపించామని పాలకవర్గంవారు, అధ్యాపకవర్గం వారు సంతృప్తిజెంది మర్నాడు శలవు ప్రకటిస్తారు. ఈకథ అంతటితో ముగుస్తుంది. బాలబాలికలనుతీర్చిదిద్దే ప్రయత్నం మాత్రం ఎవరూ చేయరు. వారిని సౌశీల్యవంతులుగా తీర్చిదిద్దడానికి అవసరమైన నీతి ప్రబోధకమైన విద్యను గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. Moral Classes దాదాపు ఏ విద్యాలయంలోను నిర్వహించబడటం లేదు. భారతీయ సంస్కృతి వైశిష్ట్యం ప్రతిబింబించే సాహిత్యం, కథలు, విద్యాలయాలలో బోధించబడటంలేదు. ఈ సమాజ శ్రేయస్సు కోసం సర్వస్వాన్ని సమర్పించిన స్వార్థత్యాగుల దివ్య జీవిత చరిత్రలు విద్యాలయాలలో చెప్పడం లేదు. మహాప్రవక్తలు ప్రపంచానికందించిన పవిత్రములైన " పసిడి పలుకులు " పసి హృదయాలకు వినిపించడం లేదు. ఆత్మ విశ్వాసాన్ని కలుగజేసి, స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించేటటువంటి, సంఘ సంస్కర్తలు వెదజల్లిన " ఆణిముత్యాల "ను బాలలకు అందించడంలేదు. సౌశీల్యవంతులుగా తయారు కావడానికి, మహర్షులు ప్రవచించిన " శుభాషితాల "ను బాలలకు నేర్పడంలేదు.

సత్యవంతులుగా తయారు కావడానికి అత్యవసరము లైన " ల"ను పాఠశాలలో బోధించడం లేదు. వివేక విజ్ఞానాదులను కలుగజేసి ప్రజ్ఞావంతులుగా తయారు కావడానికి అవసరమైన విజ్ఞాన సమాచారాన్ని విద్యార్థులకు అందివ్వడంలేదు. పురాణ, ఇతిహాసములకు సంబంధించిన నైతిక, ఆధ్యాత్మిక విషయాలను వివరించ డం లేదు. దేశ స్వాతంత్ర్యం కోసం జీవితాల సర్పించిన త్యాగశీలుర దివ్య సందేశాలను విద్యాలయాలలో వినిపించ డం లేదు. దేశభక్తి గీతాలను ఆలాపించడంలేదు. క్రమ శిక్షణ ఆవశ్యకతను, గొప్పతనాన్ని వివరించే చిన్న చిన్న కథలను బాలబాలికలకు చెప్పడంలేదు. నీతి ప్రబోధకమైన కథలను ఇండ్ల వద్ద తల్లులు పిల్లలకు చెప్పడంలేదు. ఉత్తమ సాహిత్యమును రచయితలు అవసరమైన స్థాయిలో అందించడంలేదు. ఒకవేళ ఎవరైనా అందించే ప్రయత్నం చేస్తే, వారికి ఆదరణ లభించడంలేదు. చాలా ఇండ్లలో సెక్స్, డిటెక్టివ్ సాహిత్యాలు చోటు చేసుకుంటున్నాయి. బుక్‌స్టాల్స్‌లో అర్ధ నగ్న దృశ్యాల పత్రికలు పెరిగి పోతున్నాయి. చాలామంది యువతీ యువకులు వాటికి ఆకర్షితులవుతున్నారు. ఉత్తమ మార్గమేదో తెలుసుకో లేక, అవగాహన చేసుకోలేక, చుక్కానిలేని పడవవలె పయనిస్తున్నారు పిల్లలు. ఈనాటి ఈ విచారకరమైన దుస్థితికి అందరూ బాధ్యులే.

## సచ్ఛీలము

"Character is 3/4 religion" అన్నారు శ్రీ స్వామి వివేకానంద. Character is nine points in education అన్నారు డా. సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు. "The end of education is character" అన్నారు శ్రీ సత్య సాయిబాబా. "శీలమే జీవునికి సరైన అలంకారము. శీలము లేనివాడు పశువుతో సమానం. సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. నీతి లేనివాడు కోతితో సమానము. శీలము లేనివాడు రాక్షసునితో సమానము. హృదయం లేనివాడు పాషాణంతో సమానం" అన్నారు అనుభవంతో పెద్దలు. మన సంస్కృతిలో వ్యక్తి

> "విద్య యనగా అక్షరాస్యత కాదు. వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట. ఆధునికాంగ్ల విద్య కేవలము పరాధీనమైన బ్రతుకునకే మూలము. సాంకేతిక పరిశోధన విద్యలు అవసరము."
>
> — కట్టమంచి రామలింగారెడ్డి

గత శీలమునకు అత్యున్నతమైన, గౌరవప్రదమైన ప్రముఖ స్థానం యివ్వబడింది. మనకు శ్రీరామచంద్రుడు, శివాజీ ఆదర్శము. శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు. శివాజీ పరాయి స్త్రీలను తల్లితో సమానంగా భావించేవాడని చరిత్ర చాటు తున్నది. శివాజీ కుమారుడు శంభాజీ. అతి బలపరాక్రమ సంపన్నుడు. శివాజీ కన్నా గొప్ప సాహసవీరుడు అయినప్పటికీ శివాజీకి వచ్చిన పేరు ప్రతిష్ఠలు శంభాజీకి రాలేదు. చాలామంది విద్యావంతులకే అతని పేరు తెలీ యదు. కారణం? శంభాజీ వ్యక్తిగత శీలం మంచిది కాక పోవడంవలన అతను రాణించలేదు. చరిత్రహీను డయినాడు. వ్యక్తిగత సచ్ఛీలంతో పాటు జాతీయ శీలం (దేశభక్తి) కూడా అత్యవసరం. ప్రతి వ్యక్తి వ్యక్తిగత సచ్ఛీలం, జాతీయ సచ్ఛీలం రెండూ కలిగి వుండాలి. శీలరాహిత్యం అత్యంత ప్రమాదకరమైనది. సచ్ఛీలంలేని వ్యక్తి తనను తాను ఉద్ధరించుకోలేడు. దేశానికి ఏ మాత్రం ఉపయోగపడలేడు. ఒక వ్యక్తి ఎంత మేధావి అయినప్ప టికి, ప్రముఖ సైంటిస్టు అయినప్పటికి, ఇంకా ఎంత గొప్పవాడైనప్పటికీ పై రెండు సచ్ఛీలములలో ఏ ఒకటి లోపించినా అతని వలన దేశానికి చేటు తప్పదు. కనుక విద్యాలయాలలో విద్య విజ్ఞానాదులను గరపడంతో పాటు, బాలబాలికలను సచ్ఛీలవంతులుగా తయారు కావడానికి అవసరమైన, నీతి ప్రబోధకమైన విద్యను కూడా బోధిం చాలి. అందుకోసమనే మహాత్మాగాంధీజీ "నైతిక, శీల సంపత్తులను ఇనుమడింప జేసే విద్య

> " విద్య వేరు, వివేకము వేరు. మంచికీ చెడుకూ వ్యత్యాసం తెలిసిన పిమ్మట ఎవడూ తప్పుడు పనులకు దిగడు. మనస్సులో నిలకడగా నెలకొనిన జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలుస్తుంది. దానివల్ల ప్రయోజనం వుండదు. "
>
> — రాజగోపాలాచారి

అత్యవసరము." అన్నారు. తన కాళ్ళమీద తాను నిలబడటానికి వృత్తి విద్య ఎంత అవసరమో, విద్యార్థులలో శీల సంపత్తిని పెంపొందించేందుకు అవసరమైన నీతి ప్రబోధకమైన విద్య కూడా అంత అవసరం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విషయంలో అత్యంత శ్రద్ధ వహించి విద్యాలయాలలో తప్పనిసరిగా Moral Classes నిర్వహించబడేట్లు చూడాలి. దీనికి అవసరమైన ' సిలబస్ ' ను రూపొందించి అధ్యాపకులకు మంచి తరిఫీదు యివ్వాలి.

## విద్యార్థి సంఘ ఎన్నికలు

విద్యాలయాలలో అశాంతి చెలరేగడానికి ప్రధాన కారణం " విద్యార్థి సంఘ ఎన్నికలే ". కొన్ని విద్యాలయాలలో విద్యార్థి సంఘ ఎన్నికలు జనరల్ ఎన్నికల స్థాయిలో జరుగుతున్నాయి. వేలాది రూపాయిలు ఖర్చు చేయబడుతున్నాయి. ఎన్నికలనంతరం తగాదాలు, కొట్లాటలు జరగడం, పోలీసులు బాష్పవాయుప్రయోగం చేయడం, చిట్టచివరికి నిరవధికంగా విద్యాలయాలు మూసివేయడం జరుగుతున్నది. కొన్ని విశ్వవిద్యాలయాలలో వివిధ రాజకీయ పార్టీలకు చెందిన ఏజంట్లు శాశ్వతంగా ఏదో ఒక కోర్సు చదువుతూ విద్యార్థి సంఘ నాయకులుగా చలామణి అవుతుంటారు. విద్యార్థి సంఘ ఎన్నికలు వద్దని నా అభిప్రాయం కాదు. ఎన్నికలు జరిపే పద్ధతి మాత్రం మారాలి. ప్రతి తరగతిలో గత సంవత్సరం మార్కులలో Total First వచ్చిన వ్యక్తిని ఆ తరగతి విద్యార్థి నాయకుడుగా నామినేట్ చేయాలి. వివిధ తరగతులకు ఆ విధంగా నామినేట్ చేయబడిన విద్యార్థి నాయకులను మరియు వివిధ కళలలో ఆటలలో, వక్తృత్వపు పోటీలలో ప్రథములుగా వచ్చిన వారిని కలిపి ఆ విద్యాలయ విద్యార్థి సంఘ జనరల్‌బాడీని ఏర్పాటు చేయాలి. వారు కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకుంటారు. దీనివలన డబ్బు ప్రాధాన్యత తగ్గుతుంది. విద్యార్థి సంఘ నాయకత్వం కావాలనుకున్నవారు విధిగా ఏదో ఒక రంగంలో పావీణ్యతను సంపాదించాలి. శ్రద్ధగా కృషి చేసే అలవాటు అట్టుతుంది. అనుకోకుండా క్రమశిక్షణ వస్తుంది. విద్యాలయాలు అశాంతికి గురి కావు.

## ప్రవేశ పరీక్షలు

ప్రవేశ పరీక్షలు ( Entrance Examinations ) పూర్తిగా రద్దుచేయాలి. దీనిలో అనేక అవకతవకలు జరుగుతున్నట్లు వార్తలు వినవస్తున్నాయి. ఇవి ఒక రకంగా కొన్ని ప్రయివేటు విద్యా సంస్థలు సొమ్ము చేసుకోవడానికి మాత్రమే ఉపయోగపడుతున్నాయి. డిగ్రీలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడైన విద్యార్థి, అదే విశ్వవిద్యాలయంలో పి. జి. కోర్సులు చదవడానికి ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడవ్వాలని నిర్దేశించడం అత్మవ్యచ్ఛన్న చేసుకోవడంలాంటిదే. దీనివలన విద్యార్థులలో ఒకవిధమైన నిరుత్సాహం ఏర్పడుతున్నది. చదువుమీద ఆసక్తి సన్నగిల్లుతున్నది.

## మెరిట్ - విరాళములు

వృత్తి విద్యా కోర్సులలో ( పాలిటెక్నిక్, బి. ఇ; యం. బి. బి. యస్; బి. ఇడి; బి. యల్. మొదలగునవి ) 75% రిక్రూట్‌మెంట్ మెరిట్ ద్వారాను, 25% రిక్రూట్‌మెంటు విరాళములు యిచ్చినవారి నుండి చేయాలి. ఈ పద్ధతి వలన ప్రయివేటు విద్యా సంస్థలు బిల్డింగులను

కట్టుకోవడానికి, లేబరేటరీలను అభివృద్ధి చేసుకోవడానికి అవకాశం లభిస్తుంది. అంతేకాదు మన రాష్ట్రము నుండి ఇతర రాష్ట్రములకు వలస వెళ్ళేవారి సంఖ్య కూడా తగ్గుతుంది.

## లు

ప్రతి తరగతిలో విధిగా పరీక్షలు వుండాలి. ఉత్తీర్ణులైన వారినే పై తరగతికి ప్రమోట్ చేయాలి. 10 తరగతి స్టాండర్డ్ తగ్గడానికి మూలకారణం 8, 9 తరగతుల పరీక్షలలో విధిగా ఉత్తీర్ణులవ్వాలని నిర్దేశించకపోవడమే.

## అర్హత

ఏ ఉద్యోగమునకు ఏ అర్హత గల వారు అవసరమని ప్రకటించబడుతుందో ఆ అర్హత ( qualification ) గల వారిని మాత్రమే పరీక్ష వ్రాయడానికి అనుమతించాలి. ఉ. ఉద్యోగార్హతకు 10 వ తరగతి అని ప్రకటించినప్పుడు, 10 వ తరగతి వారిని మాత్రమే పరీక్ష వ్రాయడానికి అనుమతించాలిగాని, పై చదువులు చదివిన వారికి అవకాశం యివ్వరాదు.

## AIDED, UNAIDED విద్యాలయములు

ప్రయివేటు విద్యాలయాలమీద కఠినమైన ఆంక్షలు విధించి నిరుత్సాహపరచ ప్రయత్నించడం ఎంతమాత్రం మంచిది కాదు. పేద విద్యార్థులకు, మెరిట్ విద్యార్థులకు ప్రభుత్వ విద్యాలయాలలో అవకాశం యివ్వాలి. ఆర్థిక స్తోమత వున్నవారికి స్వేచ్ఛగా ప్రయివేటు విద్యాలయాలలో విరాళమ్ము లిచ్చి చదువుకోవడానికి అవకాశం కల్పించాలి. "తాను పెట్టలేదు, అడుక్కో నివ్వదు" అన్నట్లుగా వున్నది ప్రస్తుత ప్రభుత్వ విధానం. ఇది మారాలి. ఒకే విద్యాలయంలో కొన్ని Aided posts మరికొన్ని Unaided posts వుండరాదు. Aid యివ్వ దలచుకొనిన విద్యాలయంలో Strength ను బట్టి అన్ని Post లకు Aid ఎట్టి నిర్బంధం లేకుండా యివ్వాలి.



"శీలరహితమైన విద్య ప్రమాదకరము. చాలామంది తెలివిగల దొంగల విషయంలోను, పెద్దమనుషులుగా చెలామణి అయ్యే మూర్ఖుల విషయంలోను ఇది వెల్లడవుతుంది."

— మహాత్మాగాంధీ



బిల్డింగులు, ఫర్నిచర్, లేబరేటరి సౌకర్యాలను విధిగా కలుగజేయాలి. కొన్ని విద్యాలయాలకు పాక్షికంగా Aid యివ్వడం వలన అందరి విద్యార్థుల వద్ద పాలకవర్గాలు ఫీజులు వసూలు చేస్తున్నాయి. పూర్తి Aid యిచ్చి మరియు సౌకర్యాలు కలుగజేసి ఫీజులు వసూలు చేయరాదనే నిర్బంధం పెట్టాలి. Aid యివ్వకుండా ప్రభుత్వం గుర్తించిన ( టి. సి. వగయిరాలు యివ్వడానికి ) విద్యాలయాలలో ఫీజును వసూలు చేసుకోవడానికి పాలక వర్గాలకు స్వేచ్ఛ నివ్వాలి. ఇప్పుడు Unaided Recognised విద్యాలయాలలో స్వేచ్ఛగా ఫీజు వసూలు చేసుకోవడానికి వీలులేదు. ఉపాధ్యాయులకు [illegible] ప్రకారం జీతాలు యివ్వాలనే నిర్బంధం వుండటం వలన దొడ్డి దోవన విద్యార్థుల నుండి ఫీజులు వసూలు చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఉపాధ్యాయులకు తక్కువ జీతం యిచ్చి ఎక్కువ మొత్తానికి రసీదులు కొందరు తీసుకుంటున్నారు. ఈ ద్వంద్వ విధానం వలన అధ్యాపక వర్గానికి, పాలకవర్గానికి మధ్య సంబంధాలు దెబ్బతిని ఉద్యమాలకు దారితీస్తున్నాయి. దీనికి మూల కారణం ప్రభుత్వ అవాస్తవిక, ఆచరణ సాధ్యం కానటువంటి విద్యా విధానాలే.

## ఇతర ముఖ్యాంశములు

ప్రాథమిక విద్యకు ప్రాధాన్యత నివ్వాలి. పాఠశాల సెక్షన్‌లలో 30 మంది బాలబాలికలకు మించి వుంచరాదు. కాలేజీలలో 60 మందికి మించి అనుమతించరాదు. పరీక్షలు అన్ని స్థాయిలలో ఏప్రియల్ ఆఖరికి పూర్తి చేయాలి

అన్ని రిజల్ట్సు జూన్ మొదటి వారం కల్లా ప్రకటించాలి. పాఠశాలలతో పాటు అన్ని డిగ్రీ, వృత్తి కళాశాలలు జూన్ ఆఖరుకల్లా ప్రారంభించాలి.

## ముఖ్య విషయం

ఆఖరికి ఒక ముఖ్య విషయం చెప్పదలిచాను. విద్యా విధాన వ్యవస్థలో ప్రభుత్వ జోక్యం ఎంత తక్కువగా వుంటే అంత మంచిది. ప్రయివేటు విద్యాలయాలను ప్రభుత్వం నిరుత్సాహ పరచ ప్రయత్నిస్తే అత్యంత ప్రమాదం. ఉన్నదీ పోతుంది, ఉంచుకున్నదీ పోతుంది. అందరు విద్యార్థులకు ప్రభుత్వం సీట్లు యివ్వలేదు. బీద, పేద, మెరిట్ విద్యార్థుల విషయంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకుంటే చాలు. ఆర్థికస్తోమత వున్న వారి మీద ఆంక్షలు విధించకుండా, విరాళముల ద్వారా చదువుకునే అవకాశం యివ్వాలి. అనేకమంది సంపన్న కుటుంబాలవారు తమ పిల్లలను LAW చదివించాలని లేక డాక్టరుగగాని, ఇంజనీరుగగాని చేయాలని భావించేవారున్నారు. ఉద్యోగాల కోసం కాదు వారు చదివించేది. సమాజంలో Status కావాలనే తాపత్రయంలో పిల్లల్ని చదివిస్తుంటారు అటువంటివారు. మెరిట్ మార్కులు రా లేద ని Entrance Examination లో Rank లో ప్యాసు కాలేదనే నెపంతో విరాళ మివ్వగల స్తోమతివున్న వారిని సహితం నిరుత్సాహ పరచడం ఏ మాత్రం మంచిది కాదు. ఒక చంప బీద, పేద, మెరిట్ విద్యార్థులకు రక్షణ కలిపిస్తూ, మరొక చంప సంపన్నులకు విరాళములిచ్చి చదువుకొనే అవకాశం కూడా కల్పించాలి. ప్రయివేట్ విద్యా సంస్థలను ప్రోత్సహించాలి. చదువు ఉద్యోగం కోసం మాత్రమే కాదని, విజ్ఞానాన్ని సముపార్జించ డానికనే భావం యువతలో పెంపొందించాలి. స్వేచ్ఛ నిచ్చేది, శీలమును పెంచేది, శక్తి సామర్థ్యములను ప్రసాదించేదే నిజమైన విద్య. **

# విద్యా విధానంలో ప్రభుత్వ ప్రమేయం ఉండకూడదు

— సత్యసాయిబాబా

" విద్యా విధానం విషయంలో ప్రభుత్వ ప్రమేయం ఉండకూడదు. విద్య స్వేచ్ఛగా వుండాలి. విద్యార్థులలో నైతిక, ఆధ్యాత్మిక శక్తులను పెంచేదిగా వుండాలి. మనిషిని మనీషిగా తీర్చిదిద్దగలిగేది, హృదయ వైశాల్యతను పెంచేదిగా వుండాలి. నైతికత, ఆధ్యాత్మికత పడుగు పేక లాంటివి. ఈ రెంటికీ అవినాభావ సంబంధమున్నది. ప్రస్తుత ప్రభుత్వ విద్యా వ్యవస్థ అస్తవ్యస్థంగా వున్నది. విద్యార్థుల పరిస్థితి అగమ్యగోచరంగా వున్నది. విద్యార్థులు విద్యను అర్థించేవారుగా కాకుండా, ప్రపంచ విషయాల పట్ల మోజు చూపుతూ విషయార్థులై మెలుగుచున్నారు " అని బాబాగారు ది. 21-10-85వ ఇచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలో పేర్కొనినారు. (కొంత సమాచారం నవంబరు 'శ్రీవాణి'లో యివ్వడమైనది.)

## సచ్ఛీలము

విద్యార్థులలో నానాటికి దిగజారిపోతున్న నైతికవిలువల పట్ల విచారమును బాబాగారు వ్యక్తం చేస్తూ, విద్యార్థులు సచ్ఛీలవంతులుగా తయారైనప్పుడే సమాజ పురోభివృద్ధి జరుగుతుందని చెబుతూ సచ్ఛీలమె ధనము, సదాచారమే సంపద అన్నారు. ప్రతి విద్యార్థి విద్యా వినయ శోభితుడు కావాలని, సద్గుణ సదాచార సంపన్నుడవ్వాలని చెప్పారు. జీవితమనే వృక్షము, ఆత్మవిశ్వాసం అనే వేళ్లు (Root) శీలమనే ఫలము (Fruit) తోను కూడివుంటుందని చెబుతూ ఈ రూట్, ఫ్రూట్ రెండూ లేకపోతే అది ఫైర్ వుడ్ (Fire Wood) మాత్రమే అవుతుందిగాని చెట్టు (Tree) మాత్రం కాదని చెబుతూ విద్యార్థులు ఆత్మవిశ్వాసమును పెంచుకున్నప్పుడే జీవితంలో తగిన ఫలితాన్ని ఫలమును పొందగలుగుతారని బాబా చెప్పారు.

## ఉపాధ్యాయులు

ప్రస్తుతం మనదేశంలో ఉపాధ్యాయులు **1. Complaining, 2. Explaining, 3. Inspiring** అనే మూడు తరగతుల వారున్నారని బాబాగారు చెప్పారు. మొదటి వర్గానికి చెందినవారు ఎప్పుడూ, తరచుగా వ్యవస్థమీదనో, యాజమాన్యం మీదనో, విద్యార్థుల మీదనో ఫిర్యాదులు చేయడానికి, విమర్శించడానికి అలవాటు పడ్డారని; రెండవ తెగవారు పాఠ్యాంశాలను క్షుణ్ణంగా చదివి, విద్యార్థులకు చక్కగా విశదీకరించి బోధించేవారని; ఇక మూడవ వర్గానికి చెందినవారు విద్యార్థుల హృదయాలను చక్కగా ఆకట్టుకొని, వారిని ఉత్తేజపరిచేవారని చెబుతూ నేడు **Explaining**తోపాటు **Inspiring** చేయగల ఉపాధ్యాయులు అత్యవసరమని బాబాగారు పేర్కొనినారు.

## సేవ

సేవ! సేవ! సేవ! అంటూ సేవకుడు కానివాడు నాయకుడు కాలేడని; కింకరుడు కానివాడు శంకరుడు కాలేడని బాబాగారు చమత్కరించారు. సేవలోనే వున్నది పవిత్రత; సేవద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుంది. సేవ ద్వారా హృదయ విశాలత పెరుగుతుంది. సమత్వ భావన పెంపొందుతుంది. సేవ ద్వారా భగవంతుని మెప్పును సహితం పొందవచ్చును. సేవను గురించి ఉపన్యాసం చెప్పడంకంటె సేవ చేసి చూపించడంలోనే గొప్పతనమున్నదని బాబాగారు చెప్పారు.

" Haste makes waste
Waste makes worry
So Do not be in a hurry "

"తొందరపడి ఏ పని చేయరాదు. తొందర పాటు వలన చింత కలుగుతుంది. చింత వలన తప్పుపని చేయడానికి పూనుకుంటారు. కనుక తొందర పనికిరాదు."

- సత్యసాయిబాబా

## ప్రేమ

సత్యం, ధర్మం, ప్రేమ, శాంతి, అహింసలు అనేవి పంచభూతాలు. అవే మనిషికి పంచప్రాణాలు. ఆ ఐదింటిలో 'ప్రేమ' ప్రధానమైనది. దేశ కాలమాన పరిస్థితుల కతీతమైనది సత్యమని; మన ఆలోచనలలో, తలంపులలో ప్రేమ ప్రవేశించినప్పుడు సత్యం ఆవిర్భవిస్తుందని; ప్రేమాచరణే ధర్మమవుతోందని; వాంఛలకు చేరువ కానప్పుడు శాంతి లభిస్తుందని; ప్రేమను సరైన రీతిలో అర్థం చేసుకోవడమే అహింసని బాబాగారు పేర్కొనినారు. ప్రేమను స్వార్థంకోసంకాక పరమార్థంకోసం ఉపయోగించాలి. ప్రేమ స్వార్థరహితమైనదని నిరూపించాలి. ప్రేమ పరాకాష్ట సందుకున్నప్పుడు కోరికలన్నియూ వాటంతట అవే మటుమాయమైపోతాయి. పరిపక్వ మొందిన ప్రేమయందు తర తమ భేదములుండవు. ప్రేమ లక్షణం సమర్పించడమేగాని యాచించడం కాదని బాబా గారు చెబుతూ ప్రేమతత్వానికి మించిన తత్వం వేరొకటి లేదన్నారు.

## ఏకత్వం - భిన్నత్వం

జీవిత గమ్యం ఏకత్వం. ఏకత్వ సాధనకు ఒక్కొక్క సారి భిన్నత్వాన్ని అవలంబించవలసి వస్తుంది. భిన్నత్వంతోనే ఆగిపోతే జీవితమే వ్యర్థమవుతుంది. భిన్నత్వం నుండి ఏకత్వమును సాధించడమే మన జీవిత లక్ష్యమై వుండాలని బాబాగారు చెబుతూ ఒక చక్కటి ఉదాహరణ వివరించారు. ఒక మంచి వస్త్రమును షాపులో కొని చొక్కా కుట్టడానికి దర్జీవానికిస్తే, అతడు ఆ వస్త్రమును ముక్క ముక్కలు చేసి మరల సూది దారముతో కలిపి కుట్టి అందమైన చొక్కాను తయారుచేసి యిస్తాడు. ఏకత్వమనే వస్త్రము భిన్నత్వమనే ముక్కలుగా మారి తిరిగి ప్రేమ త్యాగాలనే సూది దారంతో కుట్టబడి ఏకత్వమనే చొక్కాగా రూపొందుతుందని - అదే దివ్యత్వమని బాబాగారు పేర్కొనినారు.

## స్వధర్మం

స్వధర్మమునకు మించిన ధర్మము వేరొకటి లేదని, ఇతర ధర్మము భయదాయకమైనదని బాబాగారు చెబుతూ " స్వధర్మే నిధనం శ్రేయః " అను గీతా శ్లోకమును ఉచ్చరించి ఎవరి ధర్మమును వారు పాటించాలన్నారు. " స్వధర్మః " అంటే కేవలం వృత్తులు కావని, ఆత్మ సంబంధమైన ధర్మము అనగా ఆత్మ ప్రాప్తికి వలసిన సాధనములని; " పరధర్మః " అంటే దృశ్య సంబంధమైన ధర్మమని అనగా శబ్దాది విషయ సౌఖ్యములు, ప్రాపంచిక భోగములు మొదలైనవి. ఆత్మప్రాప్తికై ఒనర్చబడు సాధనలు, వ్రతాదులు ప్రారంభంలో ఒకింత కష్టముగ తోచినను వానిని వదలరాదు. తుదకు అనంత సౌఖ్యమును ప్రసాదించును. దృశ్య వస్తువులు ( పర ధర్మము ) ప్రారంభమున సుఖవంతములుగ కనిపించినను తుదకు పరమ దుఃఖమును కలుగజేయును. అందువలన పరధర్మము కంటే స్వధర్మమే మేలని చెబుతూ మన కాళ్ళమీద మనం నిలుచోవాలి; ఇతరుల మీద ఆధారపడరాదన్నారు. ప్రతి చిన్న విషయానికీ విదేశాలపైపు చూడటం అలవాటైంది. ఇది ఏమాత్రం మంచిది కాదు. విదేశీ కళ్ళతో చూడటం, విదేశీ చెప్పులతో అలంకించడం మానుకోవాలి. అనుకరణ అత్యంత ప్రమాదకరమైనది. అనుకరణ నాగరికత కాదు. అనుకరణ అభ్యున్నతికి

లక్షణం కాదని బాబా చెబుతూ మన కన్నులతో మనం చూచి, మన చెవులతో మనం విని, మన హృదయంతో మనం ఆనందించడానికి ప్రయత్నించినప్పుడే నిజమైన ఆనందాన్ని, అనుభూతిని పొందగలుగుతామన్నారు.

## ధ్యానము

బాబాగారు ధ్యానమును గురించి ప్రస్తావిస్తూ మూడు స్థాయిలను వివరించారు. 1. Concentration (ఏకాగ్రత) 2. Contemplation (ధారణ) 3. Meditation (ధ్యానము). ధ్యానమనేది భక్తునికి, భగవంతునికి గల సంబంధం. ధ్యాన యోగికి లభించేది ఆత్మానందం. అన్నిటికంటే గొప్ప లాభం అది. ఇది 'దుర్బలులకు, చేతకానివారికి లభించదు. ధైర్య సాహసములు కలవారికి మాత్రమే లభిస్తుంది. ప్రయత్నశీలురు మాత్రమే సాధించగలుగుతారు. శ్రద్ధగల వారికి మాత్రమే సాధ్యమవుతుంది. ఘోర తపస్సులు చేయువారి కంటెను, శాస్త్రజ్ఞానము కలవారి కంటెను, అగ్నిహోత్రాది కర్మలు చేయువారి కంటెను 'ధ్యానయోగి' అధిక్యత ఎక్కువ. ధ్యానం; ధ్యానం అని దేహంపై భ్రాంతి పెట్టుకొని ధ్యానమునకు కూర్చుంటే, ధ్యానం ఎలా కుదురుతుంది ? ఇల్లు కట్టాలంటే ఇటుకలు, సున్నం కావాలి. ధ్యానములో మనసు లీనం కావాలనుకుంటే సద్గుణములను అలవరుచుకోవాలి. పవిత్రమైన భావములను పెట్టుకోవాలి. అప్పుడే దివ్యమైనటువంటి ధ్యానంలో మనస్సు లీనమవుతుంది. అంతేకాదు దుర్గుణాలను దూరం చేసుకోవాలి. అహంకార ద్వేషములను భస్మం చేయాలి. పరిశుద్ధమైన ప్రేమను పెంచుకోవాలి. ఏకాగ్రత మానవుని సర్వకార్యములకు పునాదివంటిది. ఏకాగ్రత శక్తి సామర్థ్యములను వృద్ధి చేయును. అట్టి ఏకాగ్రత ధ్యానంవల్లనే చేజిక్కుతుందని బాబాగారు చెప్పారు.

## వైరాగ్యము

వాంఛలను విసర్జించితే మనకు బంధముండదు. దీనినే వైరాగ్యమంటారు. వైరాగ్యమనగా ఇళ్ళు, వాకిళ్ళు

> "Money comes and goes; But
> Morality comes and grows"
>
> "ధనం వస్తుంది, పోతుంది. అది అశాశ్వతమైనది. సచ్ఛీలం మాత్రం శాశ్వతమైనది. పెంచుకోవలసినది ధనం కాదు, నైతిక సంపద శీలసంపత్తి మాత్రమే."
>
> - సత్యసాయిబాబా

వదలి, ఆలుబిడ్డలను త్యజించి, కాకులు దూరని కారడువులకు వెళ్ళి ఘోర తపస్సు చేయడం కాదు. మనలోని వాంఛలను తగ్గించుకోవడానికి ప్రయత్నించడమే వైరాగ్యము. **Less luggage more comfort – make the travel a pleasure.** మనము లగేజీని తగ్గించడం చేత మన జీవితము యొక్క ప్రయాణము సులభంగా సాగిపోతుంది. మన జీవితము ఒక దీర్ఘప్రయాణము. ఈ దీర్ఘప్రయాణంలో ఎక్కువ సామాన్లను పెంచుకుంటే ఆయాస పడతాం, అవస్థపడతాం. కనుక తక్కువ మోతబరువు వుంటే ఎక్కువ సౌకర్యంగా ప్రయాణం సాగుతుందని బాబాగారు చెబుతూ వాంఛలను అనగా కోరికలను తగ్గించుకోవాలి. అప్పుడే మనశ్శాంతి చేకూరుతుంది, సుఖపడతామని చెప్పారు.

## బాబా ఆహారం

బాబా ఆహారం ఏమిటి ? అని చాలామందికి సందేహం కలగడం సహజం. బాబాగారు చాలా ఖరీదైన ఆహారం తీసుకుంటారని అనేకమంది భావిస్తుంటారు. అందరికంటే బాబాగారు చాలా తక్కువ ఆహారం తీసుకుంటారని తెలుసుకొని ఆశ్చర్యపోయాను. తన 60 ఏండ్ల జీవితంలో తాను ఎప్పుడూ ఎటువంటి శరీరరుగ్మతలకు లోను కాలేదని బాబాగారు చెబుతూ క్రమశిక్షణగా జీవితం గడపటం, మితాహారమే దీనికి కారణమన్నారు. "మిత తిండి

> " Imitation is human,
> Creation is divine "
>
> " అనుకరణ మాతవత్వం, సృష్టించుట దైవత్వం. అనుకరణ చాలా ప్రమాదము. స్వశక్తితో జీవితం గడపాలి. పరులమీద ఆధారపడరాదు.
>
> - సత్యసాయిబాబా

అతి హాయి, అతి తిండి మతి హాని " అని చెబుతూ ఉదయం ఒక గ్లాసుడు మంచినీళ్ళు, ఉదయం 9 1/2 గంటలకు రాగి సంకటిగాని రాగి రొట్టెగాని మితంగా తీసుకుంటానని చెప్పారు. శనక్కాయ పచ్చడి ఇష్టం కాబట్టి అది నంచుకుంటానని చెబుతూ మరల రాత్రికి ఒక గ్లాసుడు మజ్జిగ మాత్రం తీసుకుంటానని బాబాగారు చెప్పారు. స్వామి దినచర్యను చూస్తే విసుగూ విరామం లేకుండా గంటల తరబడి భక్తుల కోసం సమయం అంతటిని వెచ్చిస్తారు. ప్రశాంతి నిలయంలోని కట్టడాలను, విశ్వ విద్యాలయం మరియు యితర విద్యా సంస్థల బాగోగులను స్వయంగా చూసుకుంటారు. "నా జీవితమే నా సందేశం" అంటూ " మీ ఆనందమే నా ఆహారం " అన్నారు. దుఃఖం, కష్టం, విచారం అన్నీ కల్పితాలు. అవి నా దగ్గరికి రాలేవు. ఎక్కడ ఆనందం వుంటే అక్కడ దేవుడుంటాడు. కనుక దుఃఖం, విచారాలను దరికి చేరనివ్వకండని బాబాగారు హితము చెప్పారు.

## మధుర క్షణం

ఆ ఇంటర్వ్యూ సమయంలో ఒక భక్తుడు ' ఆర్థిక సమస్యలు ' అని ఏదో చెప్పబోయాడు. బాబాగారు వెంటనే అసలు ఈనాడు ప్రపంచమే అనేక ఆర్థిక సమస్యల సంక్షోభంలో వున్నదన్నారు. శ్రీ బి. వి. అప్పారావు ( లెక్చరర్ ) విద్యా విషయ సంబంధమైన ప్రశ్నలు అనేకం వేసారు. బాబాగారు వాటికి చక్కటి సమాధానాలు చెప్పారు. కొంతమంది రాజకీయ నాయకుల ప్రవర్తన వలన దేశ క్షేమానికే హాని ఏర్పడుతున్నదని చెబుతూ ఏనుగుకు అంకుశం, గుఱ్ఱానికి కళ్ళెములు వాటిని అదుపులో పెట్టడానికి ఎట్లా ఏర్పడ్డాయో తప్పుచేసేవారికి శిక్ష విధించడం కూడా అత్యవసరమన్నారు. ఉపన్యాసాల వలన ప్రయోజనం లేదంటూ, సేవ ప్రతి వ్యక్తి జీవిత లక్ష్యం కావాలని, సేవ ద్వారా ప్రేమ అనుభూతిలోనికి వస్తుందని, హృదయ విశాలత పెరుగుతుందని బాబాగారు వివరించారు. విజయవాడ లయోలా కాలేజి లెక్చరర్ శ్రీ యం. సి. దాస్ " నన్ను మంచి ఉపాధ్యాయుడుగా దీవించండి " అని కోరారు. నిన్ను దీవిస్తే కొన్ని వేల మంది విద్యార్థులు అభివృద్ధిలోనికి వస్తారంటూ బాబా వారిని దీవించారు. ' శ్రీవాణి ' కి దీవెనలకోసం బాబాని అర్థించంగా నా శిరస్సుమీద చేయిపెట్టి దీవించారు. షుమారు ఒక గంటపైన జరిగిన ఆ ఇంటర్వ్యూ నిజంగా మా జీవితంలో ఒక నూతన ఉత్తేజాన్ని యిచ్చింది. అది నిజంగా జీవితంలో మరువలేని ఒక మధుర క్షణం.

## విదేశీయులతో...

ప్రతి నిత్యం అనేక వేలమంది విదేశీయులు అక్కడికి వచ్చి పోతుంటారు. నెలల తరబడి బాబాగారితో ఇంటర్వ్యూ కోసం పడిగాపులు కాస్తున్న విదేశీయులు కోకొల్లలు. పెద్ద మొత్తాలలో బాబాగారి సేవా కార్యక్రమాలకు, విద్యాలయాలకు దానమిచ్చిన విదేశీయులు అనేకమంది. కల్పవృక్షం నీడలో ప్రతినిత్యం అనేకమంది విదేశీయులు గంటల తరబడి ధ్యానంలో నిమగ్నులై వుంటారు. అంతేకాదు ప్రశాంతి నిలయంలో వేస్తున్న రోడ్లు, కడుతున్న కట్టడాలలో విదేశీయులు అనేకమంది శ్రమదానం చేసేవారు ప్రతినిత్యం అక్కడ కనిపిస్తారు. సహజంగా మన దేశంలో ఆధ్యాత్మిక చింతన 45 లేక 50 సంవత్సరాల పైబడిన వారిలో కనిపిస్తుంది. కాని

బాబాగారి సన్నిధికి విచ్చేస్తున్న విదేశీయులలో చాలామంది 30, 40 సంవత్సరాల మధ్య నున్న స్త్రీ పురుషులు వుండటం విశేషం. చాలామంది విదేశీయులను అక్కడ కలిశాను.

ఉదాహరణ : పీటర్ ( ఆస్ట్రేలియా ) వయస్సు 35 సంవత్సరములు. వృత్తి వ్యవసాయం. మరియు థామస్ (కాలిఫోర్నియా) వయస్సు 40 సంవత్సరములు. వృత్తి వైద్యం. సుదూర ప్రాంతాలనుండి ఎక్కువ సొమ్మును ఖర్చుచేసి యింత దూరం ఎందుకు వస్తున్నారని వారిని అడిగాను. మానసిక శాంతికోసం వచ్చామన్నారు. ఆస్తులు ఒకవేళ భౌతిక ఆనందాన్ని యిస్తే యివ్వవచ్చును గాని, మానసిక శాంతిని చేకూర్చలేవని చెప్పారు. మాకు ఆర్థిక స్థితిగతులకు లోటులేదు. అయితే మాకు అక్కడ మానసిక శాంతిని యిచ్చేవారు లేరు. బాబాగారి మహిమ లను విని యిక్కడికి రాలేదు. వారి దివ్య సందేశాలను చదివి మాత్రమే యిక్కడికి వచ్చాం. వారిని కళ్ళారా చూస్తున్నాం, అనుభూతిని పొందుతున్నామంటూ ప్రశాంతి నిలయ వాతావరణమే మమ్ములను మురుగులను గావించిందని వారు చెప్పారు. వారి ప్రగాఢ విశ్వాసానికి, భక్తికి నేనెంతో ముగ్ధుడనయినాను.

## 700 వివాహాలు

విజయదశమి (ది 23-10-1985) రోజున ఉదయం ప్రశాంతి నిలయంలోని సువిశాలమైన పూర్ణచంద్ర ఆడిటోరియంలో బాబాగారి సన్నిధిలో వేదోక్తంగా 700 జంటలకు వివాహం జరిపించారు. పెదువుకు పట్టు చీరె, పట్టు రెవిక, మంగళసూత్రం, చెమికీదండ, వరుడికి నేత ధోవతి, సిల్కు ఉత్తరీయం మరియు ఇద్దరికి కలిపి ఒక స్టీలు కంచం, స్టీలు గ్లాసు, బాబాగారి ఫొటో ఉచితంగా యిచ్చారు. వివాహానికి కావలసిన మంగళ ద్రవ్యాలన్నీ సమకూర్చారు. శాస్త్రోక్తంగా వివాహాలు జరిపించారు. ఒక్కొక్క జంట తరుపున కనీసం 30 నుండి 40 మంది దాకా బంధువులు వచ్చారు. వారందరికి రెండు పూటలా ( 22 రాత్రి, 23 మధ్యాహ్నం ) భోజనం కూడా ఉచితంగా బాబాగారు ఏర్పాటు చేసారు. కనీసం 25 వేలమంది రెండు పూటలా అక్కడ భోజనం చేసి వుంటారు. వారిలో ఎక్కువమంది లంబాడీలు మరియు వెనుకబడిన తరగతులకు చెందినవారే కావడం విశేషం.

బాబాగారి సన్నిధి భక్తుల పాలిటి పెన్నిధి. ప్రశాంతి నిలయం భక్తుల పాలిటి శాంతివనం. అక్కడ ఈర్ష్యా ద్వేషాలకు చోటు లేదు. ప్రేమ, కరుణ, దయ ప్రతి వ్యక్తిలో కనిపిస్తుంది. మన సామాను ఏ చెట్టుక్రింద పెట్టినా ఎక్కడికీ పోదు. దొంగలు లేనిచోటు ఎక్కడైనా వున్నదంటే ప్రస్తుతానికి అది ఒక్క ప్రశాంతి నిలయమే. Discipline (క్రమశిక్షణ), Neatness (పరిశుభ్రత), Silence (నిశ్శబ్దము) లకు ప్రశాంతి నిలయం పెట్టిందిపేరు. భక్తులకు ప్రశాంత వాతావరణమును చేకూరుస్తూ 'ప్రశాంతి నిలయం' తన పేరును నిజంగా సార్థకం చేసుకుంటున్నది.

— కొమరగిరి కృష్ణమోహనరావు

---

సేవా కార్యక్రమాల వలన అహంకారము నిర్మూలనమవుతుంది. మనకు ఏనాడు ఈ అహంకారము నాశనమవుతుందో, ఆనాడే మనకు ఆత్మ దర్శనము లభిస్తుంది. కనుక మనలో ఉన్నటువంటి అహంకార మనే రావణుని, ప్రేమతత్వమనే రాముడు సంహరించినప్పుడే మనకు ఆత్మ సామ్రాజ్యములో నిజమైన పట్టాభిషేకము జరుగుతుంది. — సత్యసాయిబాబా

---

హఠాత్తుగా చందనని, జయంత్‌నీ చూసిన రాఘవ, మురళీ కూడా నిర్ఘాంతపోయారు. నోట మాట రానట్టు అలా వుండిపోయారు.

"ఏం మావయ్యా!... నోట మాట రావడంలేదా?" నవ్వుతూ ముందు కొచ్చింది చందన.

"నీకు... నీకు..."

"పిచ్చి లేదు..." పెద్దగా నవ్విందామె.

"అబ్బే!... ఇప్పుడు లేదు... కానీ నేను పురుడు పోసినప్పుడు మాత్రం కాస్త పిచ్చుండేది!" అంది ఓ గంభీర స్వరం.




చివ్వున వెనక్కి తిరిగిన రాఘవ అక్కడ కనిపించిన వ్యక్తిని చూసి తాచును చూసినంతగా బెదిరిపోయాడు.

"మీరు....?"

"ఊఁ! నేనే! చందనకి పురుడుపోసిన డాక్టర్ని!...." పెద్దగా నవ్వింది శ్రీనగర్ డాక్టర్.

కొయ్యబారిపోయారు మురళీ, రాఘవ.

"దుర్మార్గుడా! .... ఇదా నువ్వాడిన నాటకం? డబ్బుకోసం ఇంత ఘాతుకానికి పాల్పడతావా? ఈ సంబంధం తప్పిపోయినంత మాత్రాన చందనని నీ కిచ్చి చేస్తాననే అనుకున్నావా?

బాబుని మాయం చేసింది నువ్వేనన్న అనుమానం వచ్చాక నీ చర్యనంతా గమనించబట్టి నీ నిజస్వరూపం తెలిసిపోయింది. ఫో !....నా కళ్ళముందు నించి అవతలకి ఫో !....ఇంకెప్పుడూ నీ మొహం నాకు చూపించకు !" ఆవేశంగా అరిచింది దేవకి.

"ముందు చందన నాకు విషయమంతా వివరిస్తూ రాయకపోతే....నేను వీళ్ళు చేసిన పన్లకి ఆనాడే జైలుకు పంపేదాన్ని. సరదాగా నేనూ నాటకం ఆడాను ! పిచ్చివాళ్ళు ! డబ్బుకోసం వాళ్ళు ఆడమన్నట్లల్లా ఆడానని మురిసిపోయారు !" నవ్వుతూనే అంది డాక్టర్.

"రాఘవకి, మురళికి అంతా అర్థం అయింది. మొహాలు నెత్తురుబొట్టు లేనట్టు పాలిపోయాయి. మురళిలో ఏదో ఆశ తళుక్కుమంది.

"చందనా !" అంటూ ముందు కొచ్చాడు.

"ఏవిఁటి మురళీ ?" ఆప్యాయంగా అంది చందన.

రాఘవ నమ్మించి ఎంత ద్రోహం చేశాడు ! కానీ.... నువ్వలాంటిదానివి కాదని నాకు పూర్తి నమ్మకమే ! అందుకే అతనితో పెళ్ళి........"

"నిజానిజాలు తెలుసుకున్నావా ?" అతని మాట పూర్తి కాకుండానే వ్యంగ్యంగా అంది.

"ఆ !"

"ఏవిఁటా నిజం ?"

"నీలో ఏ తప్పూ లేదని !"

"అరె ! ఇంతకు ముందేగా నేనూ జయంత్ కలిసి ఎక్కడికో వెళ్ళిపోయావఁని........"

"ఛ !....అదంతా ఈ రాఘవ అనమన్నాడని...."

"మురళీ ! ఇంక నీ నాటకానికి తెర దించెయ్యి ! నాకు పిచ్చని నమ్మి మీ రిద్దరూ విచ్చల విడిగా మాటలన్నీ నేను విన్నానన్న సంగతి మర్చిపోయినట్టున్నావ్ ! అప్పుడు ఒకళ్ళ చరిత్రలు ఒకళ్ళు విప్పి చెప్పుకున్నారు. గుర్తుచెయ్యమంటావా ?"

మురళి మొహం పాలిపోయింది.

జరిగిన కథ

గతం తల్చుకొన్న సారధి చేసిన పనికి పశ్చాత్తాప పడతాడు. బాబు తనను అమాయకంగా నమ్మాడు. తిండానికి తిండి లేని పరిస్థితుల్లో స్నేహితుడైన రాఘవ చెప్పిన ప్రతి పని మంచీ చెడు ఆలోచించకుండానే చేశాడు. ఎంత సర్ది చెప్పుకున్నా అమాయకమైన బాబు మొహమే కళ్ళకు కన్పిస్తున్నది. ఏమైనాసరే ఈసారి బాబును వాళ్ళ నాన్న దగ్గరకు చేర్చాలి. ఆలస్యమయితే బాబుకు ప్రమాదం జరగవచ్చు అనుకున్నాడు సారధి.

(ఇక చదవండి)

"అది కాదు చందనా ! ...."

"షటప్ ! .... ముందు బైటికి నడు !" కాళిలా అరిచింది చందన.

మురళి మెల్లగా వెనుతిరిగాడు.

"ఆగు !" అరిచాడు రాఘవ.

మురళితోపాటు అందరూ తృళ్ళిపడి చూశారు.

ఎప్పుడు సూట్‌కేస్‌లోంచి తీశాడోగానీ అతని చేతిలో రివాల్వర్ మెరుస్తోంది. అతని....కళ్ళు ఎర్రగా నిప్పులు రాలుస్తున్నట్టున్నాయి.

"రాఘవా !" బిత్తరపోతూ అన్నాడు మురళి.

"అవును ! నువ్వెళ్ళద్దు !"

"ఎందుకు ?"

"నా పెళ్ళి జరిపించి నాలుగు అక్షతలువేసి మరీ వెళ్ళవుగాని !" పగలబడి నవ్వాడు రాఘవ.

"మతిపోయిందా ?" అరిచాడు శాంతారామ్.

" ఉ(హూ(! నాక్కాదు మతిపోయింది ; మీకు పోబోతోంది ! " మళ్ళీ నవ్వాడతను.

" ఏవిటా పిచ్చివాగుడు ? " దగ్గరగా రాబోయాడు శాంతారామ్.

హటాత్తుగా రాఘవ చేతిలో రివాల్వర్ మోగింది. తృళ్ళిపడి భయంగా చూశారంతా.

"నీ దగ్గర రివాల్వర్ కూడా వుందా ?" విస్మయంగా అడిగింది చందన.

" తప్పదు చందనా ! .... ఈ నా ప్రయత్నమే ప్రమాదాలతో కూడుకున్నది ! అలాంటప్పుడు ఇలాంటి జాగ్రత్తలు తీసుకోవద్దూ ? " వంకరగా నవ్వాడతను.

జయంత్ మెల్లగా రాబోయాడు.

" ఆగండి ! .... ఎవరైనా కదిలితే నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాను !....ఇప్పుడు నాలో జాలి, దయ, పాపం, పుణ్యం అనేవేం లేవు! నాక్కావల్సింది చందన! ఎలాగైనా ఆమెని పొందితీరతాను ! ఆఖరికి ఆ భగవంతుడడ్డం వచ్చినా సరే ! " గంభీరంగా అని మెల్లగా చందనకేసి అడుగులు వెయ్యసాగాడు రాఘవ.

చందన భయంగా చూసింది. దేవకి, సౌకర్లు మరింత

" చందనా ! ఇలా రా ! " సౌమ్యంగానే అన్నాడు రాఘవ. చందన రాలేదు.

" నిన్నే ! రా ! .... "

చందన కదల్లేదు.

" నీ మూలంగా ఇందరి ప్రాణాలు తియ్యడం నాకే మాత్రం ఇష్టం లేదు ! కాదంటావా నీ ఇష్టం ! వీళ్ళని కాల్చిపారెయ్యడమే కాదు ; నా దగ్గరున్న బాబుని కూడా అమానుషంగా కాల్చేస్తాను ; .... అన్ని ప్రాణాలు నా చేత తీయించడం నీకు సరదాగా వుంటే అలాగే కానీ ! " జయంత్‌కేసి గురిపెడుతూ అన్నాడు రాఘవ.

" మావయ్యా వద్దు ! వస్తాను ! " అరిచినట్టు అంది చందన.

" దట్స్ గుడ్ ! కమాన్ ! .... " రివాల్వర్ ఎగరేసి పట్టుకుంటూ విలాసంగా అన్నాడు రాఘవ.

చందన మెల్లగా అతనికేసి నడిచింది. అందరూ వూపిరి బిగబట్టి చూస్తున్నారు.

" మురళీ ! షెడ్‌లోని కారు తియ్ ! " ఆర్డర్ వేశాడు రాఘవ. అతనటు పరిగెత్తగానే—

" ఎవరూ కదలద్దు ; మురళీ కడ్డు రావద్దు ! " అంటూనే గభాల్న చందన చెయ్యి పట్టుకులాగి ఆమె కణతకి రివాల్వర్ మొన ఆనించి—

" పద ! " అన్నాడు.

చందన అడుగులు వేసింది. అతను వెళ్తూ—

" పిచ్చి వేషాలు వేసినా, ఈ సంగతి పోలీసులకి చెప్పినా మీకు మిగిలేవి చందన, బాబుల శవాలు ! ఇది బాగా గుర్తుంచుకోండి ! " అన్నాడు. అందరికీ గొంతులు తడారిపోయాయి.

వీధిలో కారు స్టార్టయిన చప్పుడుకి ప్రతిమల్లా నిల్చున్న వాళ్ళంతా కదిలి ఒక్క పరుగులో వీధిలోకెళ్ళి చూశారు.

అయితే అప్పటికే కారు మలుపు తిరిగి మాయం అయింది.

*   *   *

సారధి బాబు దగ్గరి కెళ్ళాడు. అతన్ని చూడగానే బాబు మొహం వెలిగిపోయింది. చటుక్కున లేచి వెళ్ళిపోయి ఆగిపోయాడు.

హటాత్తుగా వాడికి అంకుల్‌మీది కోపం గుర్తొచ్చింది.

" ఏవిఁటి ? " చిన్నగా నవ్వుతూ అన్నాడు సారధి.

" మీ మీద నాకు కోపం వచ్చింది !" బుంగమూతి పెట్టి అన్నాడు బాబు.

" ఎందుకు ? "

" మీరు నాకు ఏం చెప్పారు ? మీ నాన్న దగ్గరికే మనం వెళ్ళేది ! అని చెప్పలేదూ ? తీరా తీసుకొచ్చి ఇక్కడ పడేసి వెళ్ళిపోయారు ! నాకు మా నాన్న గుర్తొచ్చి ఏడుపు కూడా వస్తోంది ! " అన్నాడు బాబు. వాడి కళ్ళలో నీళ్ళూరాయి.

" ఇప్పుడొచ్చేశాముగా....ఇంక మీ నాన్న దగ్గరికి తీసికెళ్ళిపోతాను ! " అనునయంగా అన్నాడు సారధి.

" నిజవేఁనా ? " వాడి కళ్ళలో అనుమానం.

" నిజం ! "

" మరి....అమ్మ ? "

" అమ్మ కూడా వస్తుంది ! "

" ఓ ! థాంక్యూ ! అంకుల్ ! థాంక్యూ ! నిజంగా మీరు చాలా మంచివారు ! " సర్టిఫికెట్ ఇచ్చాడు బాబు. సారధి సన్నగా నవ్వాడు.

" పదండి పోదాం ! " అతని చెయ్యి పట్టుకుని లాగుతూ అన్నాడు బాబు.

" ఇప్పుడు కాదు ! " గంభీరంగా అన్నాడు సారధి.

" మరెప్పుడు ? " బాబుకి నీరసం వచ్చేసింది.

" సాయంత్రం !....తప్పకుండా తీసికెళ్తాను ! నువ్వు రెడీగా వుండు ! "

" సాయంత్రవాఁ ? " నీరసంగా అన్నాడు బాబు.

" నిజంగా తీసికెళ్తాను ! ఈ సంగతి మీ నాన్న కూడా చెప్పాను ! "

" ఓహ్ !.... మా నాన్న మీ కనిపించారా ?.... వావున్నారా ! నా కోసం బెంగపడుతున్నారా ? " ఆదుర్దాగా అడిగాడు బాబు.

" నేను చెప్పడం ఎందుకు నీ కళ్ళతో నువ్వే చూద్దుగాని !.... " నవ్వాడు సారధి.

" మరి....అమ్మ...." ఏదో అనబోయాడు బాబు. ఇంతలో బైట ఏదో అలజడి !

చప్పున వెనక్కి తిరిగా రిద్దరూ.

సారధి కళ్ళలో ఆశ్చర్యం, బాబు కళ్ళలో ఆనందం తొంగి చూసింది.

సారధి కళ్ళు చిట్లించాడు.

" అమ్మా ! " అన్నాడు బాబు ఆనందంగా.

చందనని మురళి, రాఘవ కలిసి బలవంతంగా లాక్కొస్తున్నారు. బాబు పిలుపుతో ప రి స రా లు గుర్తించిన....చందన—

" బాబూ !.... నువ్వు ! ఇక్కడ ! " అంది విస్మయంగా.

" అవునమ్మా !.... ఈ అంకులే ! నన్నిక్కడికి తీసుకొచ్చాడు !....నీకు తెలుసా....మామయ్య మంచివాడు కాదు ! నిజంగా విలన్ !.... " కోపంగా రాఘవకేసి చూశాడు బాబు.

" బాబూ ! " చందన కళ్ళలో ఆనందం !

బాబు కళ్ళు తళుక్కుమన్నాయి.

అమ్మ తనని విసుక్కోలేదు ! అమ్మా అన్నా తిట్టలేదు !.... వాడికి కొండెక్కినట్టుంది.

" అమ్మా ! " అంటూ దగ్గరికి రాబోయాడు.

" ఆగు ! " అరిచాడు రాఘవ.

బిత్తరపోయాడు బాబు.

" ఏవిటి రాఘవా ! ఇదంతా ? " అయోమయంగా అన్నాడు సారధి.

" నా నాటకంలోని చివరి భాగం ! " విలన్‌లా నవ్వాడు రాఘవ.

" మావయ్యా ! .... నీ కిది న్యాయం కాదు ! " దీనంగా అంది చందన.

" న్యాయం !....న్యాయానికి విలువ కూడా వుందా ?.... అలాంటి విలువలేని న్యాయం నా కొద్దు !....నాక్కావల్సింది నువ్వు ! .... ముల్లోకాలూ ఏకమైనా నిన్ను నా నుంచి దూరం చెయ్యలేరు ! " గంభీరంగా అన్నాడు రాఘవ.

చందన నోట మాట రావడంలేదు.

" మురళీ ! .... చందనని .... పక్క గదిలో పడేసి తలుపులు వెయ్యి ! " అన్నాడు రాఘవే మళ్ళీ. మురళి రివాల్వర్ సహాయంతోనే చందనని మరో గదిలోకి లాక్కెళ్ళాడు.

" అంకుల్ ! అమ్మ ! .... " ఏడుస్తూ అన్నాడు బాబు. వాడికి తల్లిని బలవంతంగా తీసుకొచ్చినట్టు అర్ధమైంది.

" అమ్మకేం ఫరవాలేదు ! " అని బాబుతో చెప్పి,

" రాఘవా ! ఏవిటిదంతా ? " అన్నాడు సారధి.

" చెప్పానుగా....లాస్ట్ సీన్ ! " నవ్వాడు రాఘవ. అతని నవ్వు భయంకరంగా వుంది.

" నీకేమైనా మతిపోయిందా ? "

" ఇంకా పోలేదు ! .... కానీ పోయేలా వుంది ! అందుకే....నువ్వు నాకు మరో సాయం చెయ్యాలి ! " గంభీరంగా అన్నాడు రాఘవ.

" ఏవిటి ? "

" నువ్వు వెళ్ళి వెంటనే ఓ పురోహితుణ్ణి తీసుకు రావాలి ! "

" ఎందుకు ? "

" నీ కర్మకాండలు జరిపించడానికి ! " కస్సుమన్నాడు రాఘవ. సారధికి అతని మాటలకి చెప్పలేని కోపం వచ్చింది. అయినా ఆవేశాన్ని అదుపులో వుంచుకుని—

" ఏం జరిగిందో చెప్పు రాఘవా ! " అన్నాడు అనునయంగా.

క్లుప్తంగా చెప్పాడు రాఘవ.

సారధి మొహం పాలిపోయింది.

" అయితే....ఇప్పుడేం చేద్దామని ? " అన్నాడు తడారిపోతున్న గొంతుతో.

" వెంటనే చందనని పెళ్ళి చేసుకుంటాను ! "

" దాని కావిడ ఒప్పుకుంటుందా ? "

" ఒప్పుకుంటే ఈ గొడవంతా ఎందుకు ? " చిరాగ్గా అన్నాడు రాఘవ.

" మరి ? "

"బలవంతంగా అయినా తనని పెళ్ళి చేసుకుంటాను !.... అది పుట్టినప్పుడే నా సొత్తు అనుకున్నాను ! అలాంటిది.... తను మరొకరిని చేసుకుంటుంటే చూస్తూ వూరుకుంటానా? "

" అలా అని బలవంతంగా చేసుకుంటావా ? " వింతగా చూశాడు సారధి.

" అవును ! ఆ మూడు ముళ్ళు పడితే ఇంకేం చెయ్యలేదు ! "

" రాఘవా ! .... నిన్ను చూస్తుంటే నాకు నిజంగా జాలేస్తోంది ! "

" ఏం ? " కస్సుమన్నాడు రాఘవ.

" ఇది పురాణ యుగం కాదు ! పిల్లల్ని బలవంతంగా ఎత్తుకొచ్చి రాక్షస వివాహం చేసుకోవడానికి ! కలియుగం ! ఇరవయ్యవ శతాబ్దం ! .... అవసరం అయితే మెళ్ళో తాళిని....తీసి అవతల పారేసి మొగుణ్ణి చంపడానిక్కూడా వెనకాడదీనాటి మహిళ !....అన్యాయాన్ని సహించి కాళ్ళ దగ్గర పడుండదు !....చందన మూర్తీభవించిన ఆధునిక స్త్రీ అని నువ్వే చెప్పావ్ ఒకటి రెండుసార్లు ! అలాంటి యువతి....ఈ పెళ్ళిని పెళ్ళిగా అంగీకరిస్తుందా ? " తీక్షణంగా అన్నాడు సారధి.

" ఏ తరం అయినా ఆడది ఆడదే ! .... కాస్త మారిందేమో ! .... అందుకే....కొన్నాళ్ళు సాధిస్తుంది ! ఆపై తనే రాజీ కొస్తుంది ! "

" అది నీ భ్రమ ! "

" సరే ! చూద్దాం ! ముందు నువ్వెళ్ళి ఏర్పాట్లు చూడు ! " కాస్త చిరాగ్గా అన్నాడు రాఘవ.

" అంకుల్ ! పెళ్ళెవరికి ? " అర్థం అయ్యీ అవని బాబు అమాయకంగా అడిగాడు.

" నీకు ! " కసిగా అన్నాడు రాఘవ.

" ఛీ ! ఛీ ! నా కప్పుడే పెళ్ళేమి టంకుల్ ! నీలాగా పెద్దవాణ్ణయ్యాక చేసుకుంటాను ! " తెగ సిగ్గుపడిపోయాడు బాబు.

వాడి మాటలకి చచ్చే నవ్వొచ్చింది సారధికి. అయినా నవ్వ లేదు. రాఘవ మాత్రం—

" షటప్ ! " అరిచినట్టు అన్నాడు.

" అబ్బబ్బ ! .... ఈ మావయ్యకి అన్నింటికీ కోపమే ! .... నిజంగా విలనంకుల్ ఇతనే ! " విసుగ్గా అన్నాడు బాబు.

" ఏయ్ ! .... " మీది కొచ్చాడు రాఘవ.

" ఛ ! ఆ పసివాడితో ఏమిటి రాఘవా ! జరగాల్సిందేమిటో చెప్పు ! " అన్నాడు సారధి.

" చెప్పానుగా ! "

" కానీ .... "

" ఇదిగో సారధీ ! .... నువ్వు చేస్తావా నన్నే చేసుకోమంటావా ? " సీరియస్‌గా అన్నాడు రాఘవ.

ఓసారి అతని కళ్ళల్లోకి పరిశీలనగా చూశాడు సారధి. ఆ కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయి.

" సరే ! పద ! " భారంగా నిట్టూర్చి వెనుతిరిగాడు సారధి.

" అంకుల్ !....అమ్మ...." అంటూ అతని వెంట పడ్డాడు బాబు.

" నువ్వెక్కడికి ? " జబ్బపట్టి బలంగా లాగాడు రాఘవ.

" అమ్మ దగ్గరికి ! " ఏడుస్తూ అన్నాడు బాబు.

" ఎవర్రా మీ అమ్మ ! మీ అమ్మ ఏనాడో చచ్చిపోయింది ! " ఆవేశంగా అన్నాడు రాఘవ.

చివురుటాకులా కంపించిపోయాడు బాబు.

" విలనంకుల్ !....అలా అనద్దు !....మా అమ్మ దగ్గరి కెళ్ళనీ్లేగానీ....మా అమ్మ చచ్చిపోయిందని మాత్రం అనకు ! " బావురుమన్నాడు.

"అవును ! మీ అమ్మ చచ్చిపోయింది ! మా అవసరాల కోసం నిన్ను తెచ్చి అడుకుంటున్నాం ! .... రేపో ఎల్లుండో నిన్ను గెంటేస్తాం ! " కసిగా అన్నాడు రాఘవ.

" అంకుల్ ! "

" ఆఁ ! ఆఁ ! .... అంకులే ! .... ఈ అంకులే మీ నాన్నకి తెలియకుండా నిన్నెత్తు కొచ్చాడు ! " .... తనేం మాట్లాడుతున్నాడో తనకే తెలియకుండా అన్నాడు రాఘవ. అతనికి పిచ్చి పట్టేలా వుంది !

చందన మెళ్ళో తాళి కట్టినంత మాత్రాన అది పెళ్ళిగా భావించి వచ్చి ఒళ్ళో వాలదని అతనికీ తెలుసు ! .... అందుకే నోటికొచ్చినట్టల్లా వాగుతున్నాడు.

" రాఘవా ! నీకు నిజంగానే మతిపోయింది. లేకపోతే పసివాడితో ఏమిటా మాటలు ? " కఠినంగా అన్నాడు సారధి.

అప్పటికి స్పృహలో కొచ్చాడతను.

" అయామ్‌సారీ ! అయామ్‌సారీ సారధీ ! నా మనసేం బాగాలేదు ! ఏదో వాగాను ! అవ్వేం మనసులో పెట్టుకోకు ! ప్లీజ్ ! .... వెళ్ళు ! " అన్నాడు.

" బాబు.... ? "

" ఆ గదిలోనే పడెయ్ ! "

బాబుని తీసికెళ్ళి చందన గదిలోనే వుంచి—

" బాబూ ! నువ్వు కూడా ఇక్కడే వుండు ! నేను మళ్ళీ వస్తాను ! " అన్నాడు సారధి.

" సరే ! " అన్నాడు వాడు ఆనందంగా.

సారధి బైట తాళంవేసి తాళం చెవి రాఘవ కిచ్చేసి పెళ్ళి ఏర్పాట్ల కెళ్ళిపోయాడు. ( సశేషం )

# కార్యసాధనకేం కావాలి?

నిరక్షరకుక్షియైన కాళిదాసు జగన్మాత అనుగ్రహంతో లోక విఖ్యాతి గాంచాడు. భోజరాజు ఆస్థానంలో ప్రముఖ పండితుడుగ మన్నన లందుకున్నాడు. పదవి, ప్రతిష్ఠల కారణంగా కాళిదాసు పొంగిపోలేదు. ఆశ్రయించినవారి నందరినీ ఏదో ఒక విధంగా సంతృప్తిపరచేవాడు.

స్వయంగా పండితుడైన భోజరాజు కవి పండితులను కొంతవరకు పరీక్షించి సత్కరించేవాడు.

ఒకమారు ఒక బీద బ్రాహ్మణ దంపతులు, కొడుకు కోడలుతోపాటు కాళిదాసు దర్శనం చేసుకుని రాజ దర్శనం చేయించవలసినదిగ విన్నవించుకున్నారు. కాళిదాసు వారిని రాజాస్థానానికి తీసుకొనిపోయాడు.

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

భోజరాజు ఆగంతుకులను సమాదరించి 'క్రియా సిద్ధిః సత్వే వసతి మహతాం నోపకరణే' అన్న శ్లోక పాదము నిచ్చి తక్కిన మూడు పాదములలో ఒక దానిని బ్రాహ్మణ దంపతులు, ఒక పాదమును అతని కుమారుడు, మరొక పాదమును అతని కోడలు పూరింపవలసినదిగా కోరాడు.

బ్రాహ్మణుడు సూర్యస్తుతి పరంగాను, అతని భార్య శ్రీరామచంద్రుని పరంగాను, యువకుడైన బ్రాహ్మణ కుమారుడు మన్మథుని పరంగాను, కోడలు అగస్త్య మహర్షి పరంగాను వరించారు. ఆ శ్లోకాలిలా సాగాయి :

### బ్రాహ్మణుడు :

" రథస్యైకం చక్రం భుజగయమితాః సప్తతురగాః
నిరాలంబో మార్గశ్చరణ వికలః సారధిరపి
రవిర్యాత్యేవాంతం ప్రతిదిన మపారస్య నభసః
క్రియా సిద్ధిః సత్వే వసతి మహతాం నోపకరణే॥ "

సూర్యుని రథానికున్న దొకే ఒక చక్రము, ఏడు గుర్రాలు ; పాములే, కళ్ళెం; ఆధారంలేని అంతరిక్షమే మార్గము ; సారథి వికలాంగుడు. ఇన్ని అవాంతరా లున్నప్పటికీ సూర్యుడు ప్రతినిత్యము ఆకాశ సంచారం కావిస్తున్నాడు. మహనీయుల కార్యసిద్ధి వారి శక్తిపై ఆధారపడి వుందునేకాని, వారి ఉపకరణాలపై కాదు.

### బ్రాహ్మణ పత్ని :

విజేతవ్యా లంకా చరణ తరణీయో జలనిధిః
విపక్షః పౌలస్త్యో రణ భువి సహాయాశ్చ కపయః
తథాప్యేకోరామః సకల మజయద్రాక్షస కులం
క్రియా సిద్ధిః సత్వేవసతి మహతాం నోపకరణే

గెలువ వలసింది లంకను, నడక ద్వారానే సముద్రాన్ని దాటాలి, శత్రువా మహా వీరుడైన రావణుడు, సమరంలో సహకరించేవారేమో కపులు, అయినా రాముడు రాక్షస కులాన్ని హతమార్చాడు. పెద్దలు బాహ్య సాధనములతో కాక అంతశ్శక్తి వల్ల విజయాన్ని సాధిస్తారు.

### యువకుడు :

విపక్షః శ్రీకంఠో జడతనురమాత్యః శశిధరః
వసంతః సామంతః కుసుమమిషవః సైన్యమబలాః
తథాపి త్రైలోక్యంజయతి మదనోదేహ రహితః
క్రియాసిద్ధిః సత్వేవసతి మహతాం నోపకరణే

ఎదురించవలసినవాడు శివుడు, మంత్రి అయిన చంద్రుడు జడుడు ; వసంతుడు (ఋతువు) సామంతుడు ; బాణములా పూవులు ; సైన్యమా అబలలతో కూడినది ; స్వయంగా శరీరం లేకున్నప్పటికీ, మదనుడు ముల్లోకాలను జయిస్తాడు. పెద్దల క్రియా శక్తి వుపకరణాలపై ఆధార పడక, వారి అంతశ్శక్తి ఆధారంగా వుంటుంది.

( తరువాయి 30వ పేజీలో )

# మత్తు మందుల వల్ల

## జీవన ప్రమాణ స్థాయి ఎలా దిగజారుతుంది?

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

ఇటీవల దాదాపు ప్రపంచ పర్యంతంగా అన్ని దేశాల యువతలోనూ మత్తు మందులకు అలవాటుపడడమనే దుర్వ్యసనంపట్ల ఎక్కువగా చర్చ జరుగుతున్నది. ఈ సాంఘిక రుగ్మత రోజు రోజుకు అనూహ్యంగా పెరిగి పోతుండడంవల్లా, దాని ఫలితాలు అతి తీవ్రంగా వుండడం వల్లా—ప్రపంచ క్షేమాన్ని కోరుకొనేవారు ఎంతో ఆందోళనను వెలిబుచ్చుతున్నారు. ఈ మత్తు మందులకు యువకులు బానిసలు కావడంవల్ల వ్యక్తిగతంగా వారు జీవన ప్రమాణస్థాయిని దిగజార్చుకొనే అవకాశాన్ని కొని తెచ్చుకొంటారు. అయితే వారి శారీరక, మానసిక పరిస్థితులపై ఆధారపడ్డ వ్యవస్థ కూడ వారి దిగజారుడు వల్ల అస్తవ్యస్తమౌతుంది. ఎంతో చైతన్యవంతంగా ప్రగతి పథంలో పయనించే ఒక వ్యవస్థ యొక్క క్రియాశీలత ఈ మత్తు మందుల ప్రభావం వల్ల నిర్వీర్యమై పోతుంది. ఫలితంగా పతనం ప్రారంభమౌతుంది.

మత్తు మందులు సేవించడమనేది రెండు రకాలుగా జరుగుతున్నది. మొదటిది "ఆల్కహాలిజమ్". రెండవది "డ్రగ్ అడిక్షన్". "ఆల్కహాలిజమ్" అంటే "ఆల్కహాల్"ను సేవించడమన్నమాట. ఈ "ఆల్కహాల్" నాటు సారా కావచ్చు, స్కాచ్ విస్కీ కావచ్చు, ఇంకేదైనా కావచ్చు. అన్నింటిలోనూ వుండేది "ఆల్కహాల్"! అత్యధికమైన ప్రభావాన్ని చూపేది కూడ అదే! "డ్రగ్ అడిక్షన్" అంటే మత్తు మందులకు అలవాటు పడిపోవడమన్నమాట. ఈ మందులు గంజాయి దమ్ము మొదలుకొని ఎల్. యస్. డి. వరకు ఉండవచ్చును. "హెరాయిన్" అని, "చరస్" అని "హషిస్" అని, "ఓపియమ్" అని రకరకాలుగా వ్యవహరించబడుతూ వుంటుంది. ఈ మందులకు అలవాటు పడి అర్థం పర్థం లేని ఆనందంలో ("హాల్యూసినేషన్") మునిగి తేలుతూ వుంటారు. పొగ త్రాగడాన్ని కూడ ఇందులో చేర్చవచ్చు. ఇది ఎంతగానో మథనపడవలసిన విషయం.

## వైద్యవాణి

బాధలను మరచిపోవడానికి కొందరు అలవాటు చేసుకొంటే, కొందరు "కంపెనీ" కోసం మొదలెడుతారు. మరికొందరు తమాషాకు త్రాగుతారు. జీవితంలో ప్రతిదీ అనుభవించి తీరాలన్న వెర్రి ధోరణి వున్నవారు కూడ ఇందులో వున్నారు. నాగరికత పేరుతో, ప్రిస్టేజ్ పేరుతో ఇలా రకరకాలుగా ఏవో వంకలతో, ఎన్నో సాకులతో ఈ అలవాట్లు మొదలై ప్రాణంమీదికి తెస్తాయి. వ్యాపారంకోసం ఇలాంటి దుర్వ్యసనాలను ప్రోత్సహించడం—ఆ పని ప్రభుత్వం చేసినా, ప్రజలు చేసినా భరించరానిది. శిక్షార్హమైనది. పాశ్చాత్య నాగరికతా ప్రభావం కొంత వరకూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పేరిట పెంచుకొన్న అర్థంలేని ఆచార వ్యవహారాల ప్రభావం మరికొంత వరకు—వీటివల్ల ఈ అలవాట్లు మొదలయ్యాయని భావించడం ఎంత మాత్రమూ అనుచితం కాదు. అలా

## రాకడ - పోకడ

వాస్తవంగా తెలుసు నేడు
వాన రాకడ – ప్రాణాల పోకడ
తెలియందల్లా రెండే !!
రాబందుల్లాంటి
బంధువుల రాకడ !
ఇల్లు గుల్లైన వెంటనే
ఇల్లాలి పుట్టింటి పోకడ !!

- ముదివేడు ప్రభాకరరావు

అని అన్నంత మాత్రాన మనదేశంలో మొదటి నుంచీ ఈ దురభ్యాసాలు లేవని కూడ అర్థంకాదు. (శుక్రాచార్యుని గుర్తుకు తెచ్చుకోండి !)

ఈ "ఆల్కహాలిజమ్" వల్ల, "డ్రగ్ అడిక్షన్" వల్ల శరీర ధార్మిక ప్రక్రియలన్నీ నిర్వీణ మౌతాయి. చురుకుదనాన్ని కోల్పోతాయి. ఇరవై నాలుగు గంటలూ శరీర ధార్మిక వ్యవస్థ "అనస్థటిక్ కండిషన్" లో వుంటే, సాధారణ జీవక్రియా వేగం సన్నగిల్లుతుంది. పైగా రక్తంలో "ఆల్కహాల్" శాతము పెరుగుతూ వుండడంవల్ల, జీవ వ్యవస్థ సురక్షితంగా వుండేందుకోసం ఎన్నో రకాల జీవ రసాయనిక చర్యలు త్వరితంగా జరుగుతూ వుంటాయి. ఈ జరగడం కొంతవరకూ అయితే ఫరవాలేదు. అనునిత్యం జరగవలసి రావడంతో పరిమితి అంటూ లేకపోవడంవల్ల జీవ స్థాయిక సమతుల్యత పడిపోతుంది. ఫలితంగా క్షీణ దశ మొదలౌతుంది. ప్రతి కణజాలమూ విశిష్టతనూ, క్రియాశీలతనూ రెండింటినీ పోగొట్టుకొంటుంది. మెదడు సరిగా పనిచేయదు. పని చేయడానికి కావలసిన "ట్రిప్టోఫ్యాన్", "టైరోసిన్", "కొలైన్" వంటి ముడి సేంద్రియ పదార్థాలకు కొరత ఏర్పడుతుంది. ఫలితంగా జ్ఞాపకశక్తి క్షీణిస్తుంది. కాలేయం ఛిద్రమౌతుంది. మూత్రపిండాలు పనిచేసే శక్తిని కోల్పోతుంది. "అమ్మోనియా", "లాక్టేట్" వంటి పదార్థాలు కూరుకొని పోవడంవల్ల కీళ్ళనొప్పులు, వాంతులు, విరేచనాలూ సంభవిస్తాయి. రక్తనాళాలు సంకోచ వ్యాకోచ శక్తిని కోల్పోతాయి. ఫలితంగా రక్త ప్రసరణ వేగంలో మార్పు వస్తుంది. రక్తపోటు రావచ్చును. ధమనులు బిరుసెక్కి చిట్లిపోయే ప్రమాద మున్నది. హృదయం స్తంభించే అవకాశాలు ఎక్కువౌతాయి. కణాంతర స్థాయిలో "ఎంజైమ్" ల వ్యవస్థ దెబ్బతింటుంది. "హార్మోన్" లు స్రవించడంలో మార్పులొస్తాయి. ఫలితంగా జీవ వ్యవస్థలో భద్రత నశించి న్యూమోనియా, గాస్ట్రియిటిస్, క్యాన్సర్ వంటి వ్యాధులు వచ్చే అవకాశముంది. వీటివల్ల జన్యు స్థాయిలో కూడ మార్పులు వచ్చి తరతరాలకూ అందే ప్రమాద ముంది. ఇంత హానికరమైన ఫలితాలనిచ్చే ఈ చెడు అలవాట్లను మాన్పవలసిన బాధ్యత మనకు లేదా ? ఆలోచించండి.

ప్రభుత్వము, ప్రజలూ ఒకటే అయినప్పుడు ఇంకా ఆలస్య మెందుకు ?

---

( 28వ పేజీ తరువాయి )

### కోడలు

" ఘటోజన్మస్థానం మృగపరిజనో, భూర్జవసనం
వనేవాసః కందైః అశనమతి దుస్థం వపురిదం
అగస్త్యః పాథోధిం యదకృత కరాంభోజ కుహరే
క్రియాసిద్ధిః సత్వే వసతి మహతాం నోపకరణే

పుట్టింది కుండలో, సహచరులా జింకలు ; ఆకులే వస్త్రాలు, వుండేది అడవిలో ; కందమూలాలు మాత్రమే ఆహారంగా తీసుకొన్నందున శరీరం కృశించింది, అయినా అగస్త్యుడు సముద్రాన్నే ఆపోసనం పట్టాడు. మహనీయులు బాహ్యోపకరణాలవల్ల కాక తమ అంతశ్శక్తితో సకల కార్యాలను సాధిస్తారు.

భోజరాజు ఆ పండిత కుటుంబాన్ని గొప్పగా సత్కరించారు.



# తెలుగు చిత్రసీమలో శరత్ సాహిత్యం

సాహిత్య ప్రియులకు శరత్ తెలియనివాడు కాదు. అతను రచించిన సుమారు అన్ని కథలను, నవలలను చాలా భాషలలో అనువదించి, ఇతర రచయితలు కూడా చాలా పేరు ప్రఖ్యాతులు గడించేరు. తెలుగు చిత్రసీమలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వంటి మహానటుడు జన్మిస్తాడని శరత్ నవలలు, కథలు రాసేడని కొందరు భావించే వారు కూడా !

శ్రీ రవీంద్రనాథ్ టాగూర్, శ్రీ శరత్‌చంద్ర ఛటర్జీ 20 వ శతాబ్దంలో ప్రసిద్ధికెక్కిన బెంగాలీ రచయితలు. అయినప్పటికి శరత్ తన నెప్పుడూ రవీంద్రనాథ్ టాగూర్ శిష్యునిగానే భావించేవాడు. శరత్‌చంద్ర ఛటర్జీ 1876 సెప్టెంబర్ 15 వ తేదీన హుగ్లీ జిల్లాలోని దేవనందపురము అనే పల్లెటూరులో జన్మించాడు.

అతను వ్రాసిన మంచి కథలన్నీ ఉమ్మడి కుటుంబాలలో వుండే ఆత్మీయత, అనురాగాలు, సాధక బాధకాలు గురించి చర్చించినవే.

అతను చాలా కథలు రాసినప్పటికీ " రమేర్ సుమతి ", మరియు "నిష్కృతి" అత్యున్నతమైన కథలు. ' రమేర్ సుమతి ' కథ ఆధారంగా ' మా వదిన ' అనే తెలుగు చిత్రం తీయబడింది.

ఈ కథలో కుటుంబం పెద్దది కానప్పటికి మనుష్యులలో భేదాభిప్రాయాలు చాలా వున్నాయి. రామ్ అందులో ప్రధాన పాత్రధారి. అతని వయస్సు పదమూడు సంవత్సరములు. అతనికి వయస్సు రెండు సంవత్సరము లున్నప్పుడే తల్లిదండ్రులు చనిపోతారు. వదిన వయస్సు పదమూడు సంవత్సరాలయినప్పటికి రామ్‌ని కన్న కొడుకులా పెంచుతుంది. ఆమె తల్లికి రామ్ అంటే ఇష్టం వుండదు. రామ్ చేసే అల్లరి అంతా ఇంతా కాదు. ఈ అల్లరి సమస్యలు చాలా కథలలో ఉన్నప్పటికి కథ నడిపిన తీరు, మనస్తత్వాల చిత్రీకరణ చెప్పుకోదగ్గ విశేషాలు.

మరొక వినూత్నమయిన కథ " నిష్కృతి ". దీని ఆధారంగానే అన్నపూర్ణావారి ' తోడి కోడళ్ళు ' చిత్రం తీయబడింది. ( తోడి కోడళ్ళు చిత్రంలో పాట : కారులో షికారు / ఆడుతు పాడుతు )

ఇందులో కుటుంబం చాలా పెద్దది. ముగ్గురు అన్నదమ్ములు, తోడికోడళ్ళు వాళ్ళ పిల్లలు.

డా॥ వి. ఫణీంద్రుడు

ఏ విషయంలో పరిశీలించినా ఇది ఉత్తమమైన కథ. ప్రతీ సన్నివేశం, ప్రతిరోజు ఇంటిలో జరిగే చిన్న విషయాలైనప్పటికి, చిన్న చిన్న విషయాలే పెద్ద సమస్యగా తయారయి, కథ ఇంతేనా అని అనిపించకుండా, చదువుతున్నంతసేపు ఆసక్తిని కలిగిస్తుంది.

ఈ రెండు కథలలోను చెప్పుకోదగ్గ విశేషం పిల్లల మనస్తత్వాలను చిత్రీకరించిన విధానం. ' నిష్కృతి ' కథలో పలు వయస్సులున్న పిల్లలు అల్లరిచేసే తీరును, ' రమేర్ సుమతి ' లో రాము ప్రవర్తనను చిత్రీకరించిన శరత్ అతనికి అతనే సాటి. శరత్ పిల్లల కోరికలు, కలలు అర్థం చేసుకోవడమే కాక పిల్లలని సమర్థించే తీరు అతని కథలలో స్పష్టం అవుతుంది. అతను చిత్రీకరించిన పిల్లలు మనకి నిత్యజీవితంలో చాలామంది తారసపడతారు.

" రమేర్ సుమతి " లో రాము ఒక పనిచేసి, వెంటనే దాని గురించి మరిచిపోతాడు. అంతేకాదు బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తాడు. నిష్కృతి కథలో కూడా పిల్లలు అది కావాలని, ఇది కావాలని ; పెద్దమ్మ కుడి ప్రక్కన ' నేను పడుకుంటాను ' అని ఒకరు ' కాదు

నేను పడుకుంటాను ' అని మరొకరు దెబ్బలాడుకుంటారు. ఇవన్నీ చిన్నపిల్లల తీరు, లక్షణాలు. అంత స్పష్టంగా మరే రచయిత వర్ణించలేదంటే అతిశయోక్తి కాదు.

నిష్కృతి కథలో శైలజ పిన్ని అంటే పిల్లలందరికి గౌరవం, అభిమానం. ఒకసారి పిల్లలందరూ అల్లరి చేస్తూ పిన్ని వచ్చేసరికి, అందరూ నిశ్శబ్దంగా వుండి, అల్లరి అంటే ఏమిటో తెలియనట్లు, ఏవో పుస్తకాలు చదువుతున్నట్లు నటించడం: ఇటువంటి చిన్నపిల్లల ప్రవర్తన వివరణ పాఠకుల హృదయాలలో ఒక రసానుభూతిని కల్గిస్తుంది. ' తోడి కోడళ్ళు ' సినిమాలో కూడా శ్రీ ఆదుర్తి సుబ్బారావు ఆ పిల్లల తీరును అమోఘంగా చిత్రీకరించారు.

ఇవి అత్యున్నతమైన కథలైనప్పటికి శరత్‌లోని మేధాశక్తి వీటిలో గోచరించవు. స్త్రీలో రగిలే ప్రేమ జ్వాలని, సంఘం స్త్రీలమీద ఆక్షేపించే కట్టుబాట్లుని, స్త్రీల సమస్యలని చర్చించడంలో అతను మేధావి. ఇటువంటి రచనలలో చెప్పుకోదగ్గది ' ఆలో-ఓ-ఛాయ '. ఈ కథ ఆధారంగా ' వెలుగు నీడలు ' చిత్రం తీయబడింది.

కథలో నాయకి ప్రేమ, కర్తవ్యం మధ్య నలిగిపోయి, తను ప్రేమించిన, తనను ప్రేమించే వ్యక్తికి ఇంకో అమ్మాయి నిచ్చి పెళ్ళి చేయిస్తుంది. అయితే కథ విషాదకరమైనది. సినిమా మాత్రం సుఖాంతం చేయబడింది.

స్త్రీలో ప్రేమమూర్తిని చిత్రించిన నవల బడీదీదీ. ఇది శరత్ వ్రాసిన మొట్ట మొదటి నవల. అప్పటికీ, ఇప్పటికీ పాఠకులు మెచ్చుకొన్న నవల ఇది. దీని ఆధారంగానే నిర్మించబడ్డ తెలుగు చిత్రమే భరణీ వారి ' బాటసారి '. అందులో కథానాయకి మాధవి. సురేంద్ర కోసం పరితపించే ఆమె ప్రేమ ఒక మధురానుభూతి. స్త్రీలో దాగున్న హృదయాన్ని చదవగలిగిన రచయిత శరత్. మాధవిని చిత్రీకరించిన విధానమే అందుకు నిదర్శనం.

శరత్ వ్రాసిన దేవదాసు, నవలే కాకుండా, దాని ఆధారంగా నిర్మించిన, వినోదా వారి ' దేవదాసు ' చిత్రం కూడా బహు ప్రజాదరణ పొందింది.

ప్రేమ, కర్తవ్యం మధ్య రాజీ కుదిర్చిన రచయిత శరత్. పార్వతికి తన ముసలి భర్త అంటే గౌరవం పిల్లలంటే అనురాగం. అయినప్పటికి దేవదాసు పైన ఎనలేని ప్రేమ. ఒక సన్నివేశంలో పార్వతి దేవదాసుని లేవదీసుకు పొమ్మని అడిగితే నిర్లక్ష్యంగా నిరాకరిస్తాడు. రెండవసారి పార్వతి దేవదాసుతో లేచిపోవడానికి వెనుకంజ వేస్తుంది.

శరత్ వ్రాసినవన్నీ విషాదంగా ముగిసినవి కావు. ప్రేమ ఫలించిన కథలు, నవలలున్నాయి. అటువంటి వాటిలో అందరూ మెచ్చుకొనేది ' దత్త '. ఈనాటి యద్దనపూడి సులోచనారాణి రచనల్లా చదవడానికి ఆహ్లాదంగా వుంటుంది. ఈ కథ ఆధారంగా వచ్చిన చిత్రమే కవితా చిత్రవారి ' వాగ్దానం '. ప్రఖ్యాత సినీ రచయిత ఆచార్య ఆత్రేయ నిర్మించిన చిత్రం.

ఈ కథల్లో, నవలల్లో కథా నాయకులు, నాయికలు ప్రేమించుకుంటారు కొన్ని చిన్న చిన్న సమస్యల వలన మొదటే ప్రణయంగా మారనప్పటికి, చివరకి ప్రణయంగా మారుతుంది. ' దత్త ' కథలో పదునైన సంభాషణ, ప్రణయ సన్నివేశాలలో మృదుత్వం, కథా విధానం, మానవ ప్రవర్తన చిత్రీకరణ అందరిని ఆకట్టుకొంటుంది.

కథా నాయికలను చిత్రీకరించడంలో కూడా శరత్‌కి శరతే సాటి. అతని రచనలలో నాయిక లందరూ, ఉప్పొంగే హృదయం, పట్టుదల, నేర్పు కలవారు. బహుశా అతని హృదయంలో రగిలే వేదనకి వారు ప్రతిబింబాలేమో!

శరత్ రచనలలో ప్రత్యేకత తను చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పగలగడం. అతని రచనలలో ప్రేమ సున్నితమయిన ఒక మధురానుభూతి. మానవత్వపు విలువలను, మనుష్యుల మనోప్రవృత్తులను అతను చిత్రీకరించిన తీరు రసానుభూతిని కల్గిస్తాయి. అందుకే శరత్ సాహిత్య ప్రపంచంలో ఒక అమరజీవి. తెలుగు చిత్రసీమ ద్వారా కూడా మనం అతనికి యెంతో ఋణపడి ఉన్నాము.



# ఉత్తమ చారిత్రక నవల "గోనగన్నారెడ్డి"

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో శ్రీ బాపిరాజుకి అద్వితీయమైన స్థానముంది. తెలుగు దేశానికి, తెలుగు భాషకు మహత్తరమైన సేవ చేసిన మహానుభావుడు ఆయన. వీరు వ్రాసిన "గోన గన్నారెడ్డి" ఉత్తమ చారిత్రక నవలల్లో ఒకటి.

తెలుగు సాహిత్యంలోని అత్యుత్తమ చారిత్రక నవల "గోన గన్నారెడ్డి". అచ్చంగా తెలుగు చరిత్ర, సంస్కృతిని హృదయాహ్లాదంగా చిత్రించిన నవల ఇది. చరిత్రను, కథకు అనువుగా మలచడంలో శ్రీ బాపిరాజు సిద్ధహస్తులు. ఇది కాకతీయుల కాలానికి సంబంధించింది. రచయిత ఈ నవలకు కథానాయకుడైన గోన గన్నారెడ్డి పేరు పెట్టడంలోనే ఎంతో ఉదాత్తత, ఔచిత్యం గోచరిస్తుంది. ఇది పాత్ర ప్రధానమైన నవల.

ఈ నవల "మీజాన్" దినపత్రికలో సెప్టెంబరు 27 వ తేది 1944 నుండి ఏప్రిల్ 28 వ తేది 1945 వరకు ధారా వాహికంగా ప్రచురించబడింది. 1946 లో తొలి ముద్రణ పొందింది. 1985 నాటికి ఏడుసార్లు ముద్రణ భాగ్యానికి నోచుకుంది. దీనిని శ్రీ బాపిరాజు, శ్రీ రాజా అక్కినేపల్లి జానికి రామారావు గారికి అంకిత మిచ్చారు. త్వరలో ఈ నవల చిత్రరూపంలో రానున్నది.

ఈ నవలలోని కథ ద్వాదశ ఖండాలుగా విభజించ బడింది. ఇందులో మరల చిన్న చిన్న విభాగాలుగా కథ చెప్పడం జరిగింది. కథా ప్రాధాన్యతనుబట్టి, వ్యక్తుల్ని బట్టి, సంఘటనల్ని బట్టి ఆ ఖండికలకు శీర్షికలు పెట్టారు.

కాకతీయ వంశంలో చక్కని పరిపాలనా దక్షుడుగా ఘనత కెక్కినవాడు గణపతిదేవ మహారాజు. తనకు పురుష సంతానంలేని కారణంగా పెద్ద కూతురు రుద్రమ దేవిని పురుష వేషంలో రాజ్యానికి పట్టాభిషేకం చేయిస్తాడు. ఒక స్త్రీ సామ్రాజ్యాధిపత్యం వహించడం, కొంతమంది సామంతులకు, ఇష్టంలేక పోవడంతో కుట్రలుపన్ని, తిరుగుబాటు చేశారు. ఇట్టి క్లిష్ట స్థితిలో ప్రభుభక్తి పరాయణుడు, సాహసోపేతుడైన గోన గన్నారెడ్డి తన భుజ బలంతో, రాజనీతి చతురతతో సామంతుల్ని చిత్తుగా ఓడించి తమ ప్రభువుకు విజయాన్ని కలుగుజేయడమే ఈ నవలలోని ప్రధానాంశం.

డాక్టర్ వి. సిమ్మన్న

రచయిత ఈ నవలలో చారిత్రకంగా ప్రసిద్ధి గాంచిన వ్యక్తులనే ప్రధాన పాత్రలుగా స్వీకరించారు. గణపతిదేవ చక్రవర్తి, చాళుక్య వీరభద్రుడు, రుద్రమదేవి, గోన గన్నారెడ్డి, శివదేవయ్య, లకుమారెడ్డి, యాదవ మహాదేవరాజు, మొదలగు పాత్రలన్నీ చరిత్ర ప్రసిద్ధమైనవే. కథానాయిక అన్నాంబిక పాత్ర మాత్రం రచయిత సృష్టించారు.

కళానిధి బాపిరాజుగారు ఈ నవలలో శిల్ప, చిత్ర, నృత్య, నాట్య, సంగీత, సాహిత్యాది కళల యొక్క వైశిష్ట్యాన్ని తనివితీర పొగిడారు. ఆయన కళాభిరుచి ఆ యా పాత్రల ముఖాన వెల్లడవుతుంది.

రచయిత ఈ నవలలో ఆంధ్ర వీరుల పౌరుషాన్ని పరాక్రమాన్ని, కృష్ణా గోదావరి నదుల గొప్పతనాన్ని మరియు ఆంధ్ర పండితుల గురించి వేనోళ్ళ కొనియాడారు. తన మేలిమి చేయితో తెలుగుజాతి ఔన్నత్యాన్ని, వైభవాన్ని చిత్రించిన మహాశిల్పి శ్రీ బాపిరాజు.

ఇందులో కాకతీయుల కాలంనాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితుల్ని, వ్యక్తుల మనస్తత్వాన్ని మన కళ్ళ ఎదుట సాక్షాత్కరింపచేశారు.

ఆ కాలం నాటి పంటల గురించి, పన్నుల విధానం గురించి, న్యాయ నిర్ణయాల గురించి ఈ నవలలో విపులంగా వివరించారు. రచయిత కాకతీయుల నాటి కాకతమ్మ, ఏకవీరాదేవి, దసరా ఉత్సవాలు గురించి పేర్కొన్నారు.

ఈ నవలలో సైన్యం గురించి, యుద్ధ విధానం గురించి, యుద్ధంలో ఉపయోగించే ఏనుగులు మొదలగు వాని గురించి, వాటి పోషణ విధానం గురించి, కోట బురుజుల గురించి, వ్యూహ రచనను గురించి వివరించారు.

కాకతీయుల కాలంలో వీరశైవం బాగా కనబడుతుంది. వీరశైవులు పరమత సహనం లేక బ్రాహ్మణుల్ని, వైష్ణవుల్ని, బౌద్ధుల్ని, జైనుల్ని, చార్వాకుల్ని కంఠోక్తిగా దూషిస్తూ, బాధిస్తూ ఒక్కొక్కప్పుడు హతమారుస్తూ వుండేవారని ఈ నవల వలన మనకు తెలుస్తుంది.

ఇందులో రచయిత రుద్రమదేవి మనస్తత్వాన్ని చక్కగా చిత్రించారు. రుద్రమదేవి స్త్రీయై వుండి పురుష వేషంలో రాజ్యపాలన చేయడం, స్త్రీ లందరివలె తాను కూడ వివాహమాడి భర్తతో పిల్లలతో కాలం గడపటంలోనే ఆనందం వుందని ఆ ఆనందం తనకు కరువైందని ఎంతో ఆవేదన చెందడం, తన కన్నా సామాన్య కుటుంబాల్లో జన్మించిన స్త్రీలే అదృష్టవంతులని బాధ పడటం, పురుష వేషం ధరించి పురుషునిగా నటిస్తున్నా, చాళుక్య వీరభద్రుని చూడగానే [illegible]డో అట్టడుగున దాగివున్న ఆమెలోని స్త్రీ[illegible]క ఆమెను కలవరపరచడం, అందుకు [illegible] చాళుక్య వీరభద్రుడు వేటలో పులిబారి [illegible] ఆమెను కాపాడటం, మొగిలి చెర్లలో దైవ దర్శనం [illegible] వస్తున్న సమయ[illegible]టకాయించిన హరిహర [illegible] దేవుల్ని చా[illegible]భద్రుడు వధించడం— [illegible] ఆమె స్త్రీ[illegible]న్ని తట్టిలేపుతాయి. ఒక [illegible]రాజ్య భార[illegible]మెపు తన ప్రేమ ఇలా

ఈ రెంటింటి మధ్య రుద్రమదేవి సతమతమవుతూ నలిగి పోతుంది. శ్రీ బాపిరాజు రుద్రమదేవిలోని విరుద్ధ భావాల మానసిక సంఘర్షణల్ని మన కళ్ళముందు ఉంచారు.

వీరు ఉత్తమ నవలాకారులే కాక, ఉత్తమ కవి కూడా కావడంవల్ల ఈ నవలలో కావ్య గుణం కమనీయంగా కనిపిస్తుంది. నవలకు కవితా స్థాయిని కల్పించిన ఘనత శ్రీ బాపిరాజుకి దక్కుతుంది. "గోన గన్నారెడ్డి" చదువుతుంటే కవిత్వం చదువుతున్నట్లు అనిపిస్తుంది. ఈ కవితాగుణమే ఈ నవలకు ఇంపు సొంపుల్ని కలిగిస్తూ హృదయాహ్లాదాన్నిస్తుంది.

ఈ నవలలో వచనంతోపాటు, గేయాలు, పద్యాలు, శ్లోకాలు కూడా చోటుచేసుకోవడం విశేషం.

ఇందులోని సంభాషణలు సహజంగా, వర్ణనలు సంక్షిప్తంగా, సుందరంగా, శైలి మిక్కిలి మనోహరంగా వుంటుంది. భాష సరళ గ్రాంధికం. ఈ నవలలో ఆ యా పాత్రలకు అనుగుణంగా పాత్రోచిత భాషను ఉపయోగించి పాత్రలకు తద్వారా నవలకు సహజత్వాన్ని కలుగజేశారు.

ఈ నవలలో అడుగడుగున జాతీయాలు, సామెతలు, సూక్తులు, ఊతపదాలు, మాండలిక పదాలు చోటు చేసుకున్నాయి. ఇందులోని అన్యదేశ్య పదాల్ని గమనిస్తే బాపిరాజుగారి అన్య భాషా జ్ఞాన పాటవం తేటతెల్లమవుతుంది.

మొత్తంమీద "గోన గన్నారెడ్డి" నవల రచయితకు గల భావనా పాటవంకు, కథా కథన కౌశలానికి, పాత్ర పోషణా నైపుణ్యానికి, సన్నివేశ కల్పనకు, రస పోషణకు, సంభాషణా చాతుర్యానికి, వర్ణనా వైభవానికి ప్రతిభా వ్యుత్పత్తులకు ప్రతిబింబం. 

(విశాఖ ఆకాశవాణి సౌజన్యంతో)

శ్రీవాణి

# శాపగ్రస్తులయిన స్త్రీలు

స్త్రీలు ఎన్ని పనులు చేసినా, యింకా పుట్టుకొస్తూనే వుంటాయి. కారణమేమిటి ? ఎంత చిన్న రహస్యమయినా స్త్రీ నోటిలో దాగదు. ఎందుకు ? ఎంతటి భాగ్యవంతులయినా భర్త చనిపోతే ఎటువంటి అలంకారానికి నోచుకునేదానికి వీలులేదు .... ఏమిటి కారణం ? .... వీటన్నింటినీ ఒకసారి నిశితంగా గమనిస్తే, పురాణాల ప్రకారం, ఇతిహాసాల ప్రకారం కొన్ని గాథలు తెలుస్తున్నాయి. పురాణాలు పుక్కిడి పురాణాలు, కాదనుకుంటే, అవి నిజంగా జరిగాయి అనుకుంటే, అలా కాకపోయినా పురాణాలలో కొంతవరకయినా నిజం దాగి వుందనుకుంటే, స్త్రీలు కొందరిచేత ఎలా శపించబడ్డారో, ఎందుకు శపించబడ్డారో కేవలం పఠనావశ్యకత కొరకైనా తెలుసుకుందాం.

చేగిరె లక్ష్మి సత్య

నేడు ఎందరో ఆధునిక రచయితలు స్త్రీలపై ఎన్నో చమత్కార బాణాలను వదులుతున్నారు. బహుశ వారి మాటలకు ఆధారం ప్రాచీన కాలంలో ప్రచారంలో వున్న గాధలు కావచ్చు.

## స్త్రీలు—అలంకారము :

భారత కాలంలో అంధుడైన 'దీర్ఘతముని' వుండేవాడు. అతనికి 'ప్రద్వేషిణి' అనే కన్యతో వివాహం అయింది. వారికి 'గౌతముడు' అనే పుత్రుడు జన్మించాడు. ఆమె ఎప్పుడూ భర్తపై కోపంతో వుండేది చీటికి మాటికి దీర్ఘతమునిని చీవాట్లు పెడుతూ వుండేది. ఆమె అలంకారముపై చూపే శ్రద్ధ భర్తపై చూపేది కాదు. అందువల్ల ఒకరోజు దీర్ఘతముని తన భార్యను నిలదీసి 'నేనంటే నీ కెందుకు యిష్టంలేదు, నేను నచ్చకపోవడానికి కారణం ఏమిటి ?' అని ప్రశ్నించాడు. అందుకు ఆమె 'భర్త భార్యను పోషించాలి ...అయితే, నిన్ను నేను పోషిస్తున్నాను. జీవితాంతం నిన్ను పోషించలేను' ఎక్కడికైనా వెళ్ళు, నా కెలాంటి అభ్యంతరము లేదు' అని సమాధానం చెప్పింది. ఆమె సమాధానము విన్న దీర్ఘతముని ఆవేశముతో మండిపడి మొత్తం స్త్రీ జాతినే శపించాడు. 'ఎంతటి ధనవంతులయినా సరే భర్త మరణించిన తరువాత ఎటువంటి అలంకారానికి నోచుకోకూడదు. చివరకు మాంగల్యరహితులుగా మిగిలిపోవలసిందే' అన్న మాటలు అతని నోటినుండి వెలువడినాయి. నాటినుండి భర్తలు మరణించిన స్త్రీలు ఎటువంటి అలంకారానికి నోచుకోకుండా వుండటం పరిపాటి అయింది. ఈ గాధకు ఆధారం మహాభారతం.

## స్త్రీలు—రహస్యాలు :

స్త్రీల నోటిలో ఆవగింజంత రహస్యమయినా దాగదని అంటూ వుంటాం. అయితే ఆ విషయాన్ని అంత సులభంగా కొట్టివేయటానికి వీలులేదు.

కుంతి పాండురాజు భార్య. ధర్మరాజాదుల తల్లి. ఈమె అసలు పేరు "పృథ". కుంతిభోజుడు అను రాజునకు సంతానం లేనందున ఈమెను పెంచుకున్నాడు. ఆ రాజు ఇంట పెరుగుటచే 'కుంతి' అను పేరు వాడుకలోనికి వచ్చినది. ఒకరోజు దుర్వాసుడు "కుంతి" యింటికి వచ్చి, ఆమె చేసిన అతిథి మర్యాదలకు ఆనందించి, కుంతికి ఓ మంత్రాన్ని ఉపదేశించాడు. 'దీనిని పఠించిన యెడల కోరిన దేవుడు వచ్చి నీకు వశమగును' అని చెప్పి వెళ్ళాడు. ఆ మంత్రముపై నమ్మకం కుదరని కుంతి దానిని పరీక్షించుటకై మనస్సులో సూర్యుని

ఆరాధించింది సూర్యునిలాంటి తేజస్సుగల పుత్ర జన్మించాలని. సూర్యుడు ప్రత్యక్షమయ్యాడు. ఆమె గర్భాన కర్ణుడు జన్మించాడు కన్య అయిన కుంతి భయపడి ఆ బాలున్ని రహస్యంగా ఒక పెట్టెలో పెట్టి నదిలో వదిలింది.

ఆ రహస్యం కృష్ణునికి తప్ప, పాండవులెవ్వరికీ తెలియదు. కురుక్షేత్ర యుద్ధరంగంలో కర్ణుడు మరణించాడు. కౌరవులంతా మరణించిన తరువాత, కుంతి తన పుత్ర జన్మ రహస్యాన్ని ధర్మరాజుతో చెప్పింది. ధర్మరాజు ఆవేదనతో క్రుంగిపోయాడు. యుద్ధానికి ముందు ఆ రహస్యం చెప్పి వుంటే అసలు యుద్ధమే జరిగేది కాదని, తన అన్న కర్ణుని రక్షించుకొనేవాడినని, దీని కంతకు కుంతియే కారణమని తల్లిపై విరుచుకు పడ్డాడు. క్రోధోద్రేకంలో మొత్తం స్త్రీ జాతినే శపించాడు. "స్త్రీ నోటిలో ఇసుమంత రహస్యము కూడ దాగకుండు గాక" అని. బహుశ ధర్మరాజు ప్రభావమే కాబోలు, స్త్రీలు తూ. చ, తప్పకుండా ఆయన మాటను జవదాటడం లేదు. మహాభారతం ఈ గాథకు ఆధారం.

## స్త్రీలు—పనులు :

వెట్టిచాకిరీ చెయ్యటానికే పుట్టారు కాబోలు స్త్రీలు. ప్రస్తుత కాలం మారిపోయిందనుకోండి! పనిమనుషులు, ప్రతి పనికి యంత్రాలు, వస్తువులు. యిలా ఆధునిక స్త్రీలకు పని తక్కువైందనే చెప్పాలి.

ఒకసారి దేవుడు ఒక గొప్ప కార్యాన్ని చేయాలనుకొని, దానిని స్త్రీలకు అప్పగించాలని వారికి కబురు పెట్టాడట. ఇంటి పనులతో తలమునకలవుతున్న ఆడవారు "అయిపోయింది, ఒక్క క్షణం", అంటూ కాలం గడపసాగారు. దేవుడు రెండవసారి కబురు పెట్టాడట. అయినా వారు కుంటిసాకులు చెప్పసాగారు.

ఈ లోపల పురుషులంతా దేవుడి వద్దకు చేరుకొని ఆ పనేదో మాకు అప్పచెప్పండి అన్నారు. పిలవకుండా వచ్చిన పురుషులపై దేవునికి అభిమానం కలిగి పని అప్పజెప్పాడు. ఎంత పిల్చినా రాని స్త్రీలపై దేవుడి ఆగ్రహం పెరిగింది. వెంటనే స్త్రీ లందరినీ శపించాడు. "మీ పనులు ఎంతవరకైనా తెమలకుండా ఉండు గాక! ఒక పని అయిపోగానే యింకొక పని ఎదురు చూస్తుండు గాక" అని. "పిలవకుండానే పురుషులు వచ్చారు కాబట్టి పురుషులకు ఎక్కువ విశ్రాంతి లభించు గాక!" అని వరం యిచ్చాడు. ఈ గాథకు ఆధారం ఉత్తర కెన్యాలోని "గారీ" జానపద కథ ఆధారం.

పై గాథలు నమ్మశక్యం కాకపోయినా, ప్రస్తుత పరిస్థితులను, స్త్రీ నిత్యకృత్యాలను, ఆచార సాంప్రదాయాలను గమనిస్తే ఆ శాపాలు నిజమేనని అనిపించక తప్పదు. శాపాలు ఎలా వున్నా చెల్లిగా, భార్యగా, తల్లిగా స్త్రీ పాత్ర అనిర్వచనీయం.

***

# హాలులో గడియారం తంగ్ తంగ్ మంటూ పది గంటలు కొట్టింది.

వరండాలో కొడుకు కోసం ఎదురు చూస్తున్న ప్ర శరావుగారు లేచి హాలులో కొచ్చారు.

నౌకరు రామయ్య తలుపులన్నీ మూసి హాలులోకొచ్చి, లగా నున్న తన చాప తీసుకుంటూ "బాబుగారు మీరు పడుకోండి. చిన్నబాబుగారు వచ్చిన తరువాత మిమ్మల్ని లేపుతా" అన్నాడు.

## మార్పెలా తేవాలి?




"లేదు రామయ్యా. రవితో ఈరోజు చాలా విషయాలు మాట్లాడాలి. వాడు రోజూ ఆ క్లబ్ నుండి వచ్చేసరికి రాత్రవటం నేను నిద్రపోవటం జరుగుతున్నది. పగలు మాట్లాడాలంటే, ఆఫీసంటూ, అర్జంటు అంటూ వెళ్ళిపోతున్నాడు. ఏమైనా సరే వాడొచ్చే వరకూ నేను మేలుకుంటా. నువ్వు వెళ్ళి పడుకో" అన్నారు.

"కాదు బాబు. మీరీ మధ్యనే జబ్బుపడి లేచారు. ఇంకా మేలుకుని వుంటే ఆరోగ్యం దెబ్బతింటుంది. మీరెళ్ళి పడుకోండి బాబుగారు" రామయ్య ఆయన ఆరోగ్యం గురించి హెచ్చరించాడు. ఆ హెచ్చరిక వెనక ఏదో ఆదుర్దా లీలగా గోచరిస్తున్నది.

"భలేవాడివి రామయ్యా. ఒక్కరోజు కొంచెం ప్రొద్దుపోయే వరకూ మేలుకుంటే నా ఆరోగ్యానికి ఏమీ కాదు. అయినా రవిబాబుతో వాడి పెండ్లి గురించి మాట్లాడాలి. వీడు రోజూ పొద్దుపోయే వరకూ ఆ క్లబ్‌లో ఏం చేస్తుంటాడు? త్వరగా పెండ్లిచేస్తేగాని ఇంటి పట్టున వుండడు." అన్నారు కొడుకు త్వరగా రావడానికి ఉపాయం కనుగొంటూ.

"నిజమే బాబుగారు. అబ్బాయిగారికి పెండ్లి చేసెయ్యాలి. మీరు వెళ్ళి పడుకోండి. రేప్పొద్దున్నే అన్ని విషయాలూ మాట్లాడుదురుగాని" బెరుగ్గా గేటువంక చూస్తూ యజమానిని వెళ్ళమని బలవంతం చేశాడు రామయ్య.

కొడుకుతో మాట్లాడాలి అని స్థిర నిశ్చయం చేసుకున్న ప్రకాశరావుగారు, తన మాట కెప్పుడూ ఎదురు మాట్లాడని రామయ్య అలా బలవంత పెట్టడం కొంచెం ఆశ్చర్యమనిపించింది.

"బాబుగారు, మీరు వెళ్ళి పడుకోండి. పది దాటింది" అంటూ రామయ్య చెపుతున్నప్పుడే కిర్రుమంటూ చప్పుడు చేసింది గేటు.

" బాబు వస్తున్నాడుగా, వాడితోనే మాట్లాడుతా " అంటున్న ప్రకాశరావుగారి మాటలు వినకుండా గేటు వైపు పరుగుతీశాడు రామయ్య.

రెండు నిముషాల తరువాత తనను తాను అదుపు చేసుకోలేని స్థితిలో తూలుతూ పూర్తిగా రామయ్యపైన ఆధారపడి లోపలికి వస్తున్న కొడుకుని చూసి నిశ్చేష్టుడై పోయారు ప్రకాశరావుగారు. ఆయన తేరుకునే లోపల మత్తుతో తూలిపోతూ తండ్రిని కూడా గుర్తించలేని స్థితిలో వున్న రవిని, తనకది అలవాటేనన్నట్లు బెడ్ రూం లోకి తీసుకొని వెళ్ళి మంచంమీద పడుకోబెట్టి బూట్లు ఊడతీసి, నైటు బల్బువేసి, తలుపులు దగ్గరగా లాగి ప్రకాశరావుగారి ముందరకు వచ్చి తలవంచుకుని నిలబడ్డాడు రామయ్య.

అప్పటికి తేరుకున్న ప్రకాశరావుగారు " రామయ్య ఏమిటిది ? రవి ఎప్పటినుంచి ఇలా ? నా కెందుకు తెలియ చెయ్యలేదు ? " వరుసగా ప్రశ్నించారు.

" బాబుగారు, చిన్నబాబుగారు ఈ మధ్యనే ఈ అలవాటు చేసుకున్నారు. చదువుకునే రోజుల్లో అప్పుడప్పుడు పిల్లలందరూ కలసి పార్టీ చేసుకునేవారట. ఈ ఊళ్ళో ఉద్యోగం వచ్చిన తరువాత, మీరున్నారన్న భయంతో చదువు అయిపోయిన తరువాత బాబు అసలు ముట్టుకునే వారు కాదట. మీకు జబ్బుచేసి తగ్గిన దగ్గరనుండి మీరు పెందలాడే బాబు రాకుండానే పడుకుంటున్నారు కద బాబు. పదిరోజులనాడు స్నేహితుడొకాయన కనిపించి పార్టీ ఇచ్చారుట. ఇట్లా తూలుతూ వచ్చారు. నేను అనేక విధాల చెప్పాను బాబు. మీతో చెపుతానన్నాను. నామీద కోపం వచ్చి " నౌకరువు. నువ్వు నాకు చెపుతావా ? " అని ఈ చెంప పగలగొట్టారు బాబు. మీకు చెబుదామంటే అనారోగ్యంగా వున్నారు. అమ్మగారు పోయిన దగ్గర నుండి బాబును కంటి రెప్పలా సాకారు. ఈ విషయం చెపితే తట్టుకోలేరని నేను చెప్పలేకపోయాను బాబు " అంటూ తప్పంతా తనదే అయినట్లు గద్గద స్వరంతో అన్నాడు విశ్వాసంగల నౌకరు రామయ్య.

రామయ్య బాధను గ్రహించిన ప్రకాశరావుగారు తనను వెళ్ళి పడుకోమని అన్నిసార్లు ఎందుకు బలవంతపెట్టాడో అర్థమైంది. " పోనీలే రామయ్య, నువ్వు బాధపడకు. వాళ్ళమ్మ వాణ్ణి స్థితిలో చూడకుండగనే ముందుగా కన్ను మూసింది. నేను ఇది చూడటానికే బ్రతికి వున్నాను " అన్నారు బాధాతప్త హృదయంతో.

బాగా చదువుకొని, పెద్ద ఉద్యోగం చేస్తున్న కొడుక్కి అతను చేసే తప్పునుండి ఎలా మళ్ళించాలో తెలియక గాఢంగా నిట్టూరుస్తూ తన గదిలో కెళ్ళిపోయారు.

*　　　*　　　*

అప్పుడే తూర్పున ఉదయిస్తున్న సూర్యుడు జీవితం గురించి యువతరం కనే బంగారు కలలాగా వున్నాడు. కాని కాలం గడిచే కొద్ది రంగులు వీగిపోయి ఫెళ ఫెళ వేడిని కురిపిస్తూ అసలు జీవితం ఇలాంటిది అని బోధ పరుస్తుంటాడు. రాత్రంతా ఆవేదనతో నిద్ర పట్టని ప్రకాశరావుగారు సూర్యోదయానికి పూర్వమే లేచి పెరట్లో మామిడిచెట్టు క్రింద అరుగు మీద కూర్చున్నారు. రాత్రి కొడుకుని ఆ స్థితిలో చూసిన ఆయన మనస్సు స్థిమితాన్ని కోల్పోయింది. రాత్రంతా ఆలోచనలతోనే గడిపారు.

మనిషికి స్వాభావికంగా కొన్ని అలవాట్లుంటే సంఘం కోసం మరికొన్ని అలవాట్లు చేసుకోవాలి. అలా సంఘం కోసం అలవాటు చేసుకునేదే మద్యం త్రాగటం. సొసైటీలో కంపెనీ కోసమంటూ ఎంతటి ముని పుంగవుణ్ణి అయినా గ్లాసు ఎత్తేలా చేస్తారు మద్యపాన ప్రియులు. ఒకసారి గ్లాసెత్తి. పరమపద సోపాన పటంలో నిచ్చెనలు ఎక్కినట్లు అభివృద్ధి చెంది, బాటిల్ దించకుండా త్రాగేంత వరకు అలవాటు పడతారు. బాటిల్‌ను ఖాళీచేసిన వాళ్ళే ఘనాపాటి, తన ప్రాభవాన్ని చూపటానికంటూ అమాయకుల్ని, మొహమాటస్తుల్ని చేరదీసి వాళ్ళ కంటిస్తాడీ జాడ్యాన్ని. ఆరోగ్యాన్ని, ఐశ్వర్యాన్ని హరించే పెద్ద పాము నోట్లో పడతామని తెలిసి కూడా పరమపద సోపాన పటంలో అడుగు పెడుతుంటాడు సంఘజీవి. ఆలోచిస్తూనే పాతికేళ్ళనాటి గతంలో కెళ్ళారు ప్రకాశరావుగారు.

పాతిక సంవత్సరాల క్రితం, ప్రకాశరావుగారు క్రొత్తగా ఉద్యోగంలో చేరిన రోజులు. అప్పటి యువకులు ఉద్యోగాలొచ్చే వరకు చిన్నపిల్లల క్రింద లెక్కే. ఉద్యోగ రీత్యా వెళుతున్న వారిని, అత్తగారింటి కెళుతున్న ఆడపిల్లలా ఎన్నో బోధలు చేసి, మంచి చెడు చెప్పి పంపేవారు బామ్మలు, అమ్మలు. అటువంటి బోధనలతో తీసుకొనవలసిన జాగ్రత్తలతో, హెచ్చరికలతో తన ఊరు దాటి సిటీ చేరాడు ప్రకాశ్.

ఉద్యోగస్తుడైన ప్రకాశ్‌కు చేతినిండా డబ్బుంది. సిటీలో చూడాల్సిన విశేషాలు చాలా కనిపించాయి. ఆపైన ఆఫీసులో స్నేహితులు తోడయ్యారు. సిటీలోని వింతలు, విశేషాలు చూపిస్తూ "అమృతం రుచి చూద్దువుగాని రా బ్రదర్" అంటూ "స్వర్గానికి" తీసుకెళ్ళారు.

మొదట్లో స్వర్గంలోని అమృతం రుచి చూడటానికి అమ్మా, బామ్మల మాటలు గుర్తొచ్చి ఆగిపోయినా ఫ్రండ్స్ బలవంతం దాన్ని గుటక వేయించింది. ఒకసారి పడిన గుటక మరోసారి ఫరవాలేదనిపించింది. ఆపైన "ఇన్నాళ్ళూ ఈ లోకంలో లభిస్తున్న ఈ అమృతాన్ని సేవించకుండా ఎలా వున్నాను ?" అని తనను తాను ప్రశ్నించుకున్నాడు. మరి కొన్నాళ్ళకు "అది లేకుండా వుండలేను" అనే స్థితికి వచ్చాడు.

ఇంట్లో వాళ్ళకి విషయం తెలిసి ఉత్తరం వ్రాస్తే "తనమీద కిట్టని వాళ్ళ పుకార్లని, తన అభివృద్ధి చూసి ఓర్వలేని వాళ్ళ ప్రచారాలని" వాళ్ళని నమ్మిస్తూ "తనను గురించి విన్న కథలను నమ్మవద్దని, తాను అంత బలహీనుడ్ని కాదని, తానెప్పుడూ వ్యసనాలకు లొంగనని" దొంగ ఉత్తరాలు వ్రాసి అమ్మని, నాన్నని, బామ్మని నమ్మించాడు.

ఇంటి నుండి "నిన్ను చూడాలి, కళ్ళల్లో మెదులుతున్నావు రా నాయనా" అని ఉత్తరాలు వ్రాస్తే, "ఆఫీసులో పని ఎక్కువగా వుంది. ఇప్పుడు కాదు." అని వాయిదా వేస్తూ వచ్చాడు.

ఒకసారి సడన్‌గా నాన్నగారే ప్రకాశ్‌ను చూడాలని వచ్చారు. ఆయన వున్న పదిరోజులు పది యుగాలుగా గడిచింది. అమృత సేవనం లేక ఐదు ప్రాణాల్లో దాదాపు నాలుగు గాలిలో కలిసిపోయినట్లనిపించింది. అందుకే అప్పటినుండి ఇంట్లో వాళ్ళు "నిన్ను చూడాలి రా నాయనా" అని ఉత్తరం వ్రాయగానే వెంటనే వెళ్ళి ఓ పూట వుండి రెండో పూట ప్రయాణమయ్యేవాడు. ఇంటికెళ్ళినప్పుడల్లా పెండ్లి చూపులు చూడమని గొడవ. ఉత్తరం వ్రాసినప్పుడల్లా సంబంధాల గురించి వ్రాసేవారు.

ఒకరోజు........ఆరోజు ఒక ఫ్రండ్ ట్రాన్స్‌ఫర్ అయిపోతున్నాడని పార్టీ ఇచ్చాడు. ఎప్పుడు లేట్‌గా ముగిసే ఆ పార్టీలు ఆ రోజు త్వరగా ప్రారంభమై త్వరగా ముగిసింది. ఫుల్‌గా త్రాగిన ప్రకాశ్, అతని ఫ్రెండ్ రిక్షాలో ఇండ్లకు బయలుదేరారు. ప్రకాశ్ రూమ్ ఇంకో రెండు సందులుండగా మెయిన్‌రోడ్డుమీద రిక్షా దిగాడు. ఫ్రండ్‌తో రిక్షా ముందుకు సాగింది. తన ఆధీనంలో లేని శరీరాన్ని మోస్తూ తూలుతూ నడుస్తున్నాడు ప్రకాశ్. తొమ్మిది గంటలు దాటటంతో రోడ్డుమీద జనం పలచగా వున్నారు. ఇద్దరు ముగ్గురు మగవాళ్ళు తూలుతున్న ప్రకాశ్‌ని తప్పించుకొని పోయారు. తరువాత ఇద్దరు ఆడవాళ్ళు ఆ తాగుబోతుని చూసి భయపడి గబుక్కున ప్రక్క సందులోకి వెళ్ళిపోయారు.

ఆ సందులో, ఆ సమయంలోనే ఫ్యాన్సీ షాప్‌లో సేల్స్‌గర్ల్‌గా పనిచేస్తున్న జయ నడుస్తున్నది. ఆమె కుటుంబ పరిస్థితులు ఆమెను ఉద్యోగానికి ఉసిగొల్పాయి. అంత త్వరగా చదువుకు తగ్గ ఉద్యోగం దొరకదని గ్రహించిన జయ, ప్రస్తుతం దొరికిన ఉద్యోగంలో చేరి మంచి ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నది. తను చేసే పనిని సిన్సియర్‌గా, ధైర్యంగా చేయగల ధీమంతురాలామె. అందుకే సేల్స్‌గర్ల్‌గా చేస్తున్న ఆమె ఇరుగు పొరుగుల గుసగుసలకు ప్రాముఖ్యతివ్వలేదు. వారే క్రమంగా ఆమె వ్యక్తిత్వానికి గౌరవం ఇవ్వటం ప్రారంభించారు. షాపు యజమాని అభిమానాన్ని ఆమె చూరగొంది.

తూలుతున్న ప్రకాశ్ ముందు నడుస్తున్న జయమీద తూలిపోయాడు. సడన్‌గా వెనకనుండి మనిషి మీద పడేసరికి బెదిరిపోయింది. వెనక్కి తిరిగి చూసేసరికి మత్తుగా తనను తాను నిలదొక్కుకోలేని త్రాగుబోతు కనిపించాడు. అంతే జయలో కోపం ఉవ్వెత్తున లేచింది. చేయి చాచి బలంగా ఒక్క చెంపదెబ్బ కొట్టింది. అనుకోని ఆ సంఘటనకు ప్రకాశరావు కళ్ళు తైర్లు కమ్మాయి. చెంపదెబ్బ కొట్టిన తరువాత జయలో వివేకం మేల్కొంది. " ఒళ్ళు తెలియని స్థితిలోని వ్యక్తిని కొట్టావేం ? " అని ఆమె ఆత్మ ఆమెని నిలవేసింది. వెంటనే టిఫిన్ బాక్సు మూతతీసి ప్రక్కనే ఖాళీగా పోతున్న స్ట్రీట్ పంపులోంచి నీళ్ళు పట్టి ముఖంమీద కొట్టింది. చెంపదెబ్బకు సగం మత్తు, చల్లటి నీళ్ళకు మిగిలిన సగం మత్తు విడిపోయింది.

మౌనంగా నిలబడ్డ మత్తు దిగిన ప్రకాశ్‌ని చూసి " మిష్టర్ త్రాగటం సంస్కారమైతే, రోడ్డుమీద ఇతరులకు బాధ కలిగించకుండా వుండటం సభ్యత. గుర్తుంచుకో " అని చరచరా ముందు కెళ్ళింది. అనుకోని సంఘటనతో స్తంభించిపోయిన ప్రకాశ్ కొద్ది నిముషాల తరువాత ముందుకు కదిలాడు. జయ తానుండే వీధిలోనే ఒక ఇంట్లోకి వెళ్ళటం గమనించాడు.

ఆ సంఘటన అతనిలో మార్పు తీసుకొని వచ్చింది. అతిగా వ్యామోహంలో పడి మంచి చెడు మరచిన అతని మెదడుకు ఆలోచించే శక్తిని ఇచ్చింది. మనస్సు తర్కవితర్కాలు జరిపింది. వాస్తవాన్ని గ్రహించిన హృదయం శరీరాన్ని మరి ఆ చాయలకు వెళ్ళనివ్వలేదు. చేయి మళ్ళీ మధుపాత్ర ముట్టలేదు. స్నేహితుల ఆహ్వానం అతని నిశ్చయాన్ని మార్చలేదు. వారి ఎగతాళి మనస్సును తాకలేదు.

వారం రోజులుగా జయను అబ్జర్వ్ చేస్తున్న ప్రకాశ్‌కు ఆమెను క్షమించమని అడగటానికి ధైర్యం కూడదీసుకునే సరికి పదిరోజులు పట్టింది

ఆరోజు బస్‌స్టాండ్‌లో బస్ కోసం ఎదురుచూస్తున్న జయ " ఎక్స్యూజ్‌మీ " అన్న కంఠం విని వెనక్కి తిరిగింది.

" నన్ను క్షమించండి " అంటున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయి, అర్థంకాక కనుబొమ్మలు ముడిపడ్డాయి జయకు.

" పది రోజుల క్రితం, రాత్రి పూట, త్రాగి తూలుతూ మీకు ఇబ్బంది కలిగించాను. " ఆనాటి సంఘటన గుర్తు చేశాడు.

ఆ సంఘటన గుర్తుకొచ్చిన జయ ముఖం కఠినంగా మారిపోయింది. ముఖం ప్రక్కకు తిప్పుకొని నీతో నా కనవసరం అన్నట్లు నిల్చుంది. ఆమె నిర్లక్ష్యం అతని మనస్సును చివుక్కుమనిపించింది. ఆమె క్షమించే వరకు మనస్సుకు శాంతి వుండదు. అందుకే ఆమెకు మళ్ళీ వివరించబోయే లోపలే బస్ రావడం, ఆమె వెళ్ళిపోవడంతో నిరాశగా మిగిలిపోయాడు.

రెండు మూడుసార్లు ప్రయత్నించాడు. కాని ఆమె నిర్లక్ష్యమే అతనికి మిగిలిపోయింది. అతను దగ్గరగా రావడానికి ప్రయత్నించే కొద్ది ఆమె దూరంగా వుంచింది. అనుకోనివి జరగటమే కాలం గొప్పతనము. జయకు ప్రకాశ్ ఆఫీసులోనే టైపిస్ట్‌గా ఉద్యోగం వచ్చింది. ఆఫీసులో జాయిన్ అయిన తరువాత అక్కడి స్టాఫ్, పరిస్తితులు అవగాహన చేసుకొన్న జయ ప్రకాశ్ పరిస్థితిని అర్థంచేసుకుంది. అతను ఏ విధంగా ఆ మురికి కూపంలోకి జారింది గ్రహించిన ఆమె మనస్సు జాలితో నిండి క్రమంగా అతనిని క్షమించగలిగింది. ప్రకాశ్ ఆమెతో తాను ఏవిధంగా అలవాటుపడింది తెలిపి, మరి తాగకూడదన్న తన నిర్ణయాన్ని ఆమెకు తెలియపర్చాడు. అతని నోటంట ఆ నిర్ణయం విన్న ఆమెకు విపరీతమైన సంతోషం కలిగింది.

ఒకరి నొకరు అర్థంచేసుకున్న వారు మంచి స్నేహితులై, క్రమంగా ప్రేమికులుగా మారి పెద్దల అనుమతితో దంపతులయ్యారు. ప్రశాంతంగా జీవనం గడుపుతున్న వారి జీవితంలో వేయి కాంతులతో రవి ప్రవేశించి వారి మనస్సులకు, ఇంటికి కాంతుల్ని తెచ్చాడు.

జీవితం సామాన్యంగా, ఏ విశేషము లేకుండా సాగితే మానవజన్మకు విశేషత ఏముంటుంది ? అందుకే వారిని చూచి ఓర్వలేని విధి జయను ప్రకాశ్ నుంచి దూరం చేసింది. ఆమె వియోగాన్ని రవి ఆటపాటలతో మరచి, అతన్ని పెంచి, ఆఫీసరుగా చూడగలిగిన ప్రకాశ్, రవిలోని బలహీనతను ఎలా దూరం చెయ్యాలో తెలియక ఆవేదన చెందసాగారు.

ఎండ చురుక్కున తాకేసరికి గతంలో నుండి వర్తమానంలోకి జారిన ప్రకాశ్‌రావుగారు ఆలోచనల నుండి తేరుకుని లోపలకు నడిచారు. రవి ఇంకా నిద్దుర లేవలేదు. హాలులో పేపర్ తిరగవేస్తూ కూర్చున్నారు.

" రవికుమార్‌గారున్నారాండి ? " అన్న ప్రశ్నకు తలెత్తిన ప్రకాశరావుగారికి, చేతినిండా ఫైల్స్‌తో వున్న రవి ఆఫీస్ క్లర్క్ కనిపించాడు.

" రండి " అంటూ అతన్ని ఆహ్వానించి, అటు వచ్చిన రామయ్యకు రవిని లేపమని చెప్పి లోపల కెళ్ళిపోయారు. ఇప్పుడు కొడుకుతో విషయం మాట్లాడటం కుదరదు కనుక స్నానం, పూజ ముగించుకొని రావడానికి లోపలి కెళ్ళారు.

ప్రకాశ్‌రావుగారు తిరిగి హాల్‌లో ప్రవేశించేసరికి సీరియస్‌గా ఫైల్‌ను చూస్తున్న ఆఫీసరు రవికుమార్ కనిపించాడు.

బాధ్యతను విస్మరించకుండా ఆఫీసు ఫైల్‌లో మునిగి వున్న కొడుకుని ఎలా మందలించాలా అని ఆలోచిస్తున్న ప్రకాశ్‌రావుగారిని గడియారం తంగ్‌న గంట కొట్టి వర్తమానంలోకి తీసుకొచ్చింది. తలెత్తి గడియారం చూశారు. టైమ్ తొమ్మిదిన్నర అయింది. గది బయట కొచ్చేసరికి ఆఫీసుకు రడీఅయి బూటు లేసు బిగించు కుంటున్న కొడుకు కనిపించాడు.

" హలో డాడీ ! ఆరోగ్యం ఎలా వుంది ? " అలికిడికి తలెత్తి హాల్‌లో కొచ్చిన తండ్రిని ప్రశ్నించి, ప్రక్కనే వున్న రామయ్యతో " వేళకు మందులు, ఆహారం మర్చిపోకుండా ఇవ్వు రామయ్యా " అని చెప్పి " ఆఫీసుకు టైమయింది వెళ్ళొస్తాను డాడీ " అంటూ బూట్లు టకటక లాడించుకుంటూ వెళ్ళిపోయాడు.

ప్రకాశరావుగారు నీర్సంగా సోఫాలో కూర్చుండి పోయారు. తాను కొడుకుతో మాట్లాడాలనుకున్న విషయాలు, అతన్ని ఏ విధంగా మందలించాలా అని చేసిన ఆలోచనలు, అతన్ని వేయాలనుకున్న ప్రశ్నలకు అవసరం, అవకాశం రానే రాలేదు.

రాత్రి తండ్రిని కూడా గుర్తుపట్టలేని స్థితిలో మత్తుగా తూలుతున్న కొడుకు దర్శనమిస్తే, ఇప్పుడు బాధ్యత గల ఆఫీసరుగా హడావిడిగా వెళ్ళిపోయాడు. అతని దురభ్యాసాన్ని మానమని చెప్పటం ఎలా ? అతనిలో మార్పు తెచ్చేదెలా ? తలెత్తి ఎదురుగా వున్న భార్య ఫొటోవైపు దృష్టి సారించి ఆలోచిస్తున్న అతనికి భార్య చిరునవ్వు ఆయన కేదో సందేశమిచ్చింది. దాన్ని అమలు పెట్టాలని నిర్ణయానికొచ్చిన ప్రకాశరావుగారు ఒక్కసారి గాఢంగా నిట్టూర్చి, తన ఆవేదన, గుండెబరువు తొలగించు కొని, ధైర్యం, వ్యక్తిత్వం, దృఢ అభిప్రాయాలున్న అమ్మాయితో రవి వివాహం జరిపించాలన్న నిర్ణయంతో సోఫాలోంచి లేచారు పెండ్లిండ్ల పేరయ్యను కలిసేందుకు.

★★

## కేంద్ర గ్రంథాలయ బోర్డులో పోతుకూచి

ప్రఖ్యాత రచయిత శ్రీ పోతుకూచి సాంబ శివరావు రాష్ట్రప్రభుత్వ కేంద్ర గ్రంథాలయ సలహా బోర్డులో సభ్యులుగా నియమితులైనారు. ఈ బోర్డు 3 సంవత్సరాలు పని చేస్తుంది. ఈ బోర్డుకు అధ్యక్షులు గ్రంథాలయ శాఖామాత్యులు శ్రీ అయ్యన్నపాత్రులు. శ్రీ పోతుకూచి రాష్ట్ర చిన్న పత్రికల సంఘం అధ్యక్షులు కూడాను. వారికి మా అభినందనలు.

- (సం)

# ధర్మసాహిత్యం

దెందుకూరి దుర్గాప్రసాద్

సాహిత్యమంటే ఆలోచనామృతం అన్నారు పెద్దలు. ఈ సాహిత్యం ఎలా వుండాలి ? ఆనంద ప్రధానంగా వుండాలా ? లేక సాంఘిక ప్రయోజనం చేకూర్చేదిగా వుండాలా ? అనే విషయంమీద చాలాకాలం నుండి చర్చలు అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వున్నాయి. సాహిత్యాన్ని ప్రబంధ సాహిత్యమనీ, ప్రాచీన సాహిత్యమనీ, అభ్యుదయ కవిత్వమనీ, అనుభూతి కవిత్వమనీ, విప్లవ కవిత్వమనీ వివిధ రూపాలుగా విశ్లేషిస్తున్నారు. హితంతో కూడినది సహితము. అట్టి హితకారిణియే సాహిత్యము. కనుక హితంతో కూడినది మానవజాతి కల్యాణాన్ని కాంక్షించేది సాహిత్యమని స్థూలంగా అంగీకరించాలి. హితంలేని వ్రాతలు ఇంకేమన్నా అవుతాయి కాని సాహిత్యం కాదు. ఈ హితం కవికి, పాఠకుడికీ, సమాజానికి కూడా కావాలి. కవిత్వం ప్రధానంగా మానసిక ఆలోచనలకు సంబంధించింది కనుక మనిషి ఆలోచనలు భ్రష్టం కాకుండా, అతనికి మానసిక కాలుష్యం యేర్పడకుండా రచన వుండాలను కోవడం అవాంఛనీయం కాబోదు.

ప్రబంధాలలో కథా సంవిధానం ఎలా వున్నప్పటికీ "అభ్యుదయ పరంపరగా నా చెప్పబూనిన ప్రబంధమునకు కథాక్రమంబెట్టిదనిన " అని వుండనే వున్నది. అయితే అభ్యుదయం అంటే యేమిటి ? ధర్మం అంటే ఏమిటి ? అనే విషయాలు తెలిసికోవాలి. అభ్యుదయం అంటే మేలు జరగటం. ధర్మము అనగా నేటి ఆధునికులు మతమని ఆదొక పెనుభూతమని కేవలం ఒక ఆచార కాండయని అనుకుంటూంటారు 'ధారణాత్ ధర్మః' అంటే సమాజాన్ని నిలిపి వుంచేది అని అర్థం. అలా సమాజాన్ని నిలిపి వుంచేదిగా, సమాజంలో ప్రేమాను రాగాలను మానవత, జీవకారుణ్యం, సౌభ్రాతృత్వం మొదలైన మానవీయ లక్షణాలను పెంపొందించేదిగా సాహిత్యం వుండాలి. ధర్మం అంటే భగవద్గీతలోని శంకరభాష్య ఉపోద్ఘాతంలో ఇలా వుంది.

> జగతః స్థితి కారణం సాక్షాత్ ప్రాణినాం
> అభ్యుదయ నిశ్శ్రేయస హేతుః యః సధర్మః ।

కాబట్టి జగత్తును నిలిపి వుంచేది కవికి పాఠకునికి సమాజానికి మేలు కలిగించేదే ధర్మ సాహిత్యము. అభ్యుదయ నిశ్రేయస్సులను కలిగించే ధర్మ సాహిత్యం పద్యములోనున్నా, గద్యములోనున్నా, గేయమైనా, వచన కవితైనా ఏ సాహిత్య ప్రక్రియలోనున్నా, ధర్మ ప్రేరకము, మానవ మనస్తత్వములో సాత్త్విక భావ పరంపరను, ధార్మిక జాగరణను కలిగించి మనిషిని పశువుగా మారకుండా కాపాడుతుంది. ఒక కథగాని, సాహిత్యము గాని చదివి మనిషి మానవత్వం మరిచి హింసావాదిగా మారి ఈ సమాజంమీద ద్వేషం పెంచుకొని తన మానసిక వాతావరణాన్ని కాలుష్యం చేసికొని సమాజ వాతావరణాన్ని కాలుష్యమయం చేస్తే అది సాహిత్యమౌతుందా ? దానికి అభ్యుదయ సాహిత్యం అని పేరు పెడితే అభ్యుదయం అవుతుందా? ఆదికవిదైనా, అరుద్రదైనా, శ్రీనాథుడిదైనా, శ్రీశ్రీదైనా, రావిశాస్త్రిదైనా, విశ్వనాథదైనా, ప్రక్రియ పాతదైనా క్రొత్తదైనా పాత క్రొత్తల మేలుకలయికదైనా ఫరవాలేదు. కాళిదాసు అన్నట్లు పాతదంతా మంచిదీ కాదు—క్రొత్తదంతా చెడూ కాదు. విజ్ఞుడైనవాడు రెండింటిని పరీక్షించి ఉత్తమమైనదాని నెన్నుకుంటాడు. ఈనాటి భీతావహ వాతావరణంలో, అస్తవ్యస్త, అరాచక, అయోమయ పరిస్థితులలో ధర్మ సాహిత్యం శతసహస్ర కమలాలుగా వికసించి మానవజాతికి ఆరోగ్యాన్ని, ఆనందాన్నీ అందించాలి. ఇట్టి సాహిత్యం మనిషిని మనీషిగా తీర్చిదిద్దటానికి ధర్మమయ జీవితాన్ని పెంపొందింప చేసికొనటానికి అటు రసాత్మక ఆనందాన్ని ఇటు సామాజిక ప్రయోజనాన్ని సాధించాలి. 

# గోపీచంద్ రచనల్లో హేతువాద దృక్పథం

"తెలుగుజాతి ఆలోచనా ధోరణిలో ఒక నూతన దృక్పథాన్ని, హేతువాదాన్ని రేకెత్తించిన గొప్ప రచయిత గోపీచంద్".

"ఈ జీవితం ఇలా వుంది. ఈ సమాజం ఇలా వుంది. ఈ మనిషి ఇలా ప్రవర్తించాడు. ఎందుకిలా వుంది ?—నీకు నచ్చినా నచ్చకపోయినా వున్న పరిస్థితి ఇది. జీవితాన్ని వున్నది వున్నట్లుగా ముందు అంగీకరించమ"నే విధానం గోపీచంద్‌ది. గోపీచంద్ రచనల్లో ఏదో ఒక పాత్ర రచయితే అవుతాడు. తన సొంత అభిప్రాయాలకు, ఆలోచనలకు రచనలో స్థానం కల్పించడానికి ఇలాంటి విధానాన్ని అవలంబించాడు గోపీచంద్. గోపీచంద్ నవలల్లో గడియపడని తలుపులు, మెరుపుల మరకలు, యమపాశం, చీకటిగదులు, అసమర్థుని జీవయాత్ర, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా ప్రసిద్ధమైన నవలలు. ఆయన రచనలకి వ్యక్తిత్వం ఇచ్చినది ఆయన నిజాయితీ అంటారు. కలల బరువు, గీతా పారాయణం, ఆత్మద్రోహులు, ఉభయకుశలోపరి, ఇలా జరిగేను, కార్యశూరుడు, అంతరంగం ఇతని కథలలో కొన్ని.

గోపీచంద్ వ్రాసిన కథలలో సంప్రదాయాలను, సాంఘిక వ్యవస్థలను, రాజకీయాలను, సెక్స్ విషయాలనూ—ఇలా అనేక విషయాలను హేతువాద దృక్పథంతో విమర్శిస్తూ పాఠకులకు యదార్థాన్ని అందించాలనే ప్రయత్నం కన్పడుతుంది. "ఆశాజ్యోతి" గోపీచంద్ వ్రాసిన కథలలో విశిష్టమైనది. అందులో "ఆశకు అంతులేదు ; జీవితానికి పునాదే ఆశ. జీవించడం అంటేనే ఆశ పడటం. ఆశాజ్యోతి సర్వకాల సర్వావస్థలయందు వెలుగుతూనే వుంటుంది" అంటాడు గోపీచంద్.

ఇక నవలల్లో సంప్రదాయ బద్ధమైన జీవితాన్ని, భర్తనూ వదిలి వ్యక్తి వికాసం ఆకాంక్షిస్తూ పట్టణానికి వచ్చిన ఆధునాతన యువతిగా కోటేశ్వరమ్మను "గడియ పడని తలుపులు" నవలలో గోపీచంద్ చిత్రించాడు. ఈ నవలలో గోపీచంద్ కోటేశ్వరమ్మలో కన్పడతాడు. ఈ నవలలో ఒకచోట—"ఏవో సిద్ధాంతాలూ, సమస్యలూ అనుకొని వెంటపడతాం కాని, ఈ చిన్న చిన్న విషయాలలో వున్న ఆనందం యింకెందులోనూ వుండదు. వీటిని వదులుకొని వాటివెంట పడటం ఎదురుగా కనపడే మంచి నీటిని వదులుకొని మృగతృష్ణ వెంట పడటం వంటిదే...." అని అంటాడు. 'గడియ పడని తలుపులు' ఒక ప్రయోగాత్మక రచన. గోపీచంద్ తలుపులకు 'గడియ పడక' పోవడాన్ని ఇది వ్యక్తం చేస్తుంది.

## వాసిరెడ్డి వేణుగోపాల్

ఇక 'మెరుపుల మరకలు' నవలలో కథానాయికిగా ఉషారాణిని చిత్రించాడు గోపీచంద్. అద్భుతమైన పాత్ర అది. అసలు గోపీచందే అద్భుతమైనవాడు. అతను నిజానికి చాలా ఆవేశపరుడు, హేతువాది. ఆయన 'అసమర్థుని జీవయాత్ర' వ్రాస్తున్న రోజులలో భౌతిక వాదానికి ఎక్కువగా విలువ నిచ్చి—ఆ భౌతికతత్వంలో మనస్సు నలుగుడు, కదలికల్ని సాంఘికపరంగా ఎత్తి చూపించాడు. అతనే 'మెరుపుల మరకలు' లోకి వచ్చేసరికి అతని వాడి, వేడి ఏమయ్యాయో ? హేతువాదానికి స్వస్తి చెప్పి, 'మిస్టిసిజమ్' లోకి అడుగుపెట్టి ఆధ్యాత్మికవాదం వైపు పరుగులు వేశాడు. దానికి ఫలితం 'ఉషారాణి'. ఆవిడలోని అంతస్సంఘర్షణలు కారణాయుతంగా చిత్రించి, చివరికి తీసికెళ్ళి హిమాలయాల్లో వదిలేస్తాడు. భౌతిక వాదానికి, మనోవాదానికి ఈ రెండింటి

“నీవు ఎవరికి అపకారం చేయకు. నీ ఆలోచనలలోగాని, నీ మాటలలోగాని, నీ చేతలలోగాని, ఏ వ్యక్తికీ కష్టము, నష్టము కలిగించకు. సాధ్యమైనంతవరకు అందరిని ఆనందింపజేయి. నీ ఆనందాన్ని, సుఖాన్ని త్యాగం చేసిఅయినా సరే ఇతరులను ఆనందింపజేయి. తద్వారా భగవంతుడు అనుగ్రహిస్తాడు.

నీవు చేసే ఏ పనియైనప్పటికి కూడ ఇతరులకు కష్టము, నష్టము కలుగకుండ ఉంటే అది మంచిపనే. నీవు చేసే పని ఇతరులకు కష్టము కలిగించినా, నష్టము కలిగించినా నీకు మంచిదే అనిపించినా అది మంచిది కాదు అని అర్థం చేసుకోవాలి.

అందరిని ప్రేమించడం ద్వారా, అన్నింటిని ప్రేమించడం ద్వారా భగవంతుని మనం ప్రేమించిన వారము అవుతాము.”

- అవతార్ మెహెర్‌బాబా

కున్న ప్రాధాన్యతని చిత్రిస్తూ—వాటి అసమగ్రతని ఎత్తిచూపుతూ—ఆత్మవాదంపైపు నడిపిస్తాడు. ‘మెరుపుల మరకల’పై వచ్చిన విమర్శల తాకిడికి గోపీచంద్ మనఃస్థితి ఎలా వుందో కేశవమూర్తి ద్వారా వివరించుకున్నదే “ పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా ”.

‘ పరివర్తన ’ గోపీచంద్ మొదటి నవల. ఇందులో రాజారావు పాత్ర భార్యా వియోగం వల్ల నిరాశాపరుడిగా అవుతాడు. దానిని గోపీచంద్ ‘ సెంటిమెంటలిజం’గా విమర్శిస్తాడు. అయితే ఇది రచయితకే అంతగా తృప్తినివ్వలేకపోయింది. ఇది రచయిత ఊహగా మాత్రమే మిగలడంతో రెండో ప్రయత్నంలో ‘ అసమర్థుని జీవయాత్ర’ను సాగించాడు గోపీచంద్. ఇందులో తనకు వున్న హేతువాద దృక్పథాన్ని నిలువరించుకొని దాని తాలూకు ఫలితాన్ని, మృత్యుచ్ఛాయలనూ తనలోనుంచి ఛేదించి వేశాడు. తెలుగు నవలా సాహిత్యంలో ఒక విశిష్టమైన, శక్తివంతమైన మనోవిశ్లేషణా రచనగా ‘ అసమర్థుని జీవయాత్ర ’ నిలిచిపోయింది. వ్యక్తి మనస్తత్వాన్ని సీతారామారావు పాత్రలో చక్కగా చూపించారు గోపీచంద్ తన ‘ అసమర్థుని జీవయాత్ర’లో. రెండు విధాలయిన మనస్తత్వంతో సీతారామారావు పాత్ర నలిగిపోతుంది. సీతారామారావు ప్రవర్తన సరిగా చూడకపోతే హాస్య ప్రవర్తనగా కన్పడుతుంది. పరిశీలనా దృష్టితో చూస్తేనే అతని మనస్తత్వమూ, అతని గంభీరత, తాత్వికత అర్థమయి అతనిపట్ల ఒక విధమైన కరుణ, సానుభూతి, అనురాగం ఏర్పడుతుంది.

ఒక హేతువాది జీవిత యాత్రగా ‘ అసమర్థుని జీవయాత్ర’ను రూపొందించాడు గోపీచంద్. తండ్రి మరణం తరువాత తను అనుభవించిన మనోవైకల్యాన్ని, ఈ నవలలో సీతారామారావు పాత్ర ద్వారా చూపిస్తాడు. నవలలో సీతారామారావు పాత్ర మృత్యువుతో పోరాడి, ఓడిపోవడం ద్వారా గోపీచంద్ వ్యక్తిగతంగా కూడా పునర్జన్మ వంటి కొత్త అనుభూతిని సంతరించుకొని క్రొత్త జీవితాన్ని, సాహిత్య విధానాన్ని అలవర్చుకున్నాడు.

ఇక గోపీచంద్ చివరి నవల ‘ చీకటి గదులు ’. ఆయన జీవిత మది. అందులో ఆనాటి పరిస్థితులు, అతని బాల్యం, తండ్రి, కుటుంబ వాతావరణం, యథాతథంగా చిత్రించాడు. అదంతా ఒక ఎత్తు దానికి ‘ చీకటి గదులు ’ పేరు పెట్టడం ఒక ఎత్తు. అలా పేరుపెట్టి ఆయన మనని వెలుతురు గదుల్లో వుంచి, ఆ అగాధమైన చీకటిలో—‘ అనంపూర్ణం’గా కలిసిపోయాడు.



# పక్షులు ఆత్మహత్య చేసుకుంటాయా ?

మానసిక శాస్త్ర నిపుణుల అభిప్రాయం ప్రకారం మానవుడు మినహా మరే ఇతర జీవి ఆత్మహత్యకు పాల్పడదు. కాని ప్రతి సంవత్సరం పై ప్రశ్న అక్టోబర్ మాసంలో ప్రకృతి పరిశీలకులకు ఎదురవుతున్నది. అందుకు కారణం అస్సాం రాష్ట్రంలోని కచార్ కొండల్లోని పక్షుల వింత ప్రవర్తన. జతింగ అనే గ్రామంలో కనిపించే ఈ వింతను వంద సంవత్సరాల క్రితమే నమోదు చెయ్యటం జరిగింది. అయినప్పటికి ఈ మధ్య కాలం వరకు శాస్త్రజ్ఞులు ఆ పక్షులమీద పరిశోధన ఆరంభించలేదు. ప్రయత్నించిన కొందరు పరిశోధనను మధ్యలో ఆపివెయ్యటంతో ఇప్పటికీ ఆ పక్షుల ప్రవర్తన ఒక సమస్యగానే మిగిలిపోయింది.

జతింగ ఆటవిక తెగ ప్రజలు నివశించే చిన్న గ్రామం. జనాభా సుమారు పదిహేను వందల వరకు వుంటుంది. ఆగష్టు-అక్టోబర్ మధ్య కాలంలో ఇక్కడి ప్రజలకు సంబరం. ఆ సమయంలో ఆ గ్రామ ప్రజలు పొడవైన వెదురు బొంగులను పాతి, రాత్రివేళలో వాటికి లాంతరు దీపాలను వేళాడగడతారు. ఆ కాంతికి ఆకర్షించబడి కొన్ని వందల పక్షులు అక్కడికి చేరతాయి. వాటిని కఱ్ఱలతో కొట్టి చంపుతారు గ్రామస్థులు. ఒక్కొక్క గ్రామస్థుడు ఒక్క రాత్రిలో సుమారు రెండు వందల పక్షులను పట్టుకోవటమో, చంపటమో చేస్తాడు. దీనిని బట్టి ఒక ఋతువులో మొత్తం ఎన్ని పక్షులు మరణిస్తున్నాయో ఊహించుకోవచ్చు. కొన్ని పక్షులు లాంతరుకు తగిలి కిందపడతాయి. కింద పడిన ఈ పక్షులకు నీరు, ఆహారం అందించినప్పటికి అవి తీసుకోవు. ప్రాణం వదిలేవరకు అవి అక్కడినుండి కదలవు.

అస్సాం అడవుల్లో కొన్ని వందల పక్షి జాతులు నివశిస్తున్నాయి. కాని ఆ జాతులన్నీ దీపపు కాంతికి ఆకర్షించబడవు. కొంగలు, గువ్వలు, పావురాయి వంటి సుమారు పదిహేను పక్షి జాతులు మాత్రమే ఆ విధంగా ప్రవర్తిస్తున్నాయి. ఈ పక్షులు రాత్రిపూట సంచరించేవి కావు. అయినప్పటికి రాత్రివేళ ఎంతో దూరం నుంచి ఒక చిన్న దీపపు కాంతికి ఆకర్షింపబడి ఎందుకు వస్తున్నాయో అర్థంకాదు.




ఈ పక్షుల వింత ప్రవర్తనకు ఆ ప్రాంతంలో ఆ సమయంలోవున్న వాతావరణానికి సంబంధం వున్నట్టు అర్థమవుతున్నది. ఆగష్టు 15 నుంచి అక్టోబర్ 31 మధ్య కాలంలో మాత్రమే పక్షులు అలా ప్రవర్తిస్తున్నాయి. చంద్రుడిని మబ్బు కప్పేసినపుడు, గాలిలో తేమ అధికంగా వున్నప్పుడు లేదా వర్షపు జల్లు పడుతున్నప్పుడు ఈ పక్షులు అధిక సంఖ్యలో దీపపు కాంతికి ఆకర్షించబడుతున్నాయి. రాత్రి ఏడు, పదిగంటల మధ్యలో గాలి దక్షిణం నుంచి ఉత్తరం వైపుకు వీస్తుండగా ఈ పక్షులు గాలికి వ్యతిరేకంగా ఎగురుతూ జతింగా గ్రామానికి చేరుతున్నాయి.

ఈ పక్షులు ఒక్క జతింగ గ్రామంలోని దీపాలకు మాత్రమే ఎందుకు ఆకర్షించబడుతున్నాయి ! ప్రాణాలు పోతాయని తెలిసినా పక్షులెందుకలా ప్రవర్తిస్తున్నాయి ! ప్రతి ఋతువులో అంత ఎక్కువ సంఖ్యలో పక్షులు మరణిస్తున్నా, కొత్త పక్షులు ఎక్కడనుంచి వస్తున్నాయి ! ఇవి ఇప్పటికీ సమాధానం దొరకని ప్రశ్నలు.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

## గేటు దగ్గర... వాచ్‌మన్ లేడు.

రెండు రూపాయలు మిగులు _ అనుకున్నాడు దయానిధి మనసులో. చిన్న గేటు దగ్గరగా వేసి ఉంది. తోసుకుని లోపలకు వెళ్ళారిద్దరూ.

“ అటూ యిటూ చూడకు... తిన్నగా ముక్కుకి సూటిగా చూసుకుంటూ నడువ్ ” హెచ్చరించాడు రామచంద్రమూర్తి.

“ అలాగే ” నవ్వాడు దయానిధి అతని పిరికితనానికి.




గేటు నుంచి__బిల్డింగ్‌కి__రోడ్డే. కాని....అది చాలా పొడవుంది. వాళ్ళు మెల్లగా నడుస్తున్నారు. రోడ్డు కటూ యిటూ లాన్‌లు....ఆ వెనుక పార్కులాగ పూల మొక్కలు. సంరక్షణ బాగా జరుగుతూంది కాబోలు, అవి ఏపుగానూ, దట్టంగానూ పెరగడమే కాకుండా పూలు కూడా పూస్తున్నాయి.

లాన్స్ దాటితే పూల మొక్కలు.

ఆ పూల మొక్కలవేపు నుంచి.

“ ఏమండోయ్....”

త్రుళ్ళిపడి ఆగిపోయాడు రామచంద్రమూర్తి.

దయానిధి కూడా ఆగిపోయాడు.

అంతలోనే_మెదడు పనిచేసినట్లు_“ మనని అయి వద. ” అన్నాడు రామచంద్రమూర్తి దయానిధి చేయందుకుని కదులుతూ.

“ ఔను. ఇక్కడ మన మెవరికి తెలుసు ? ”

“ మీ__డాక్టరు విజయకి తప్ప....”

“ ఆవిడకీ తెలియదు, పరిచయం చేసుకుంటే. ”

రెండడుగులు వేశారో లేదో__

మళ్ళీ....“ ఏమండోయ్....”

“ మిమ్మల్నే....”

“ మిమ్మల్నే....”

ధ్వని__ప్రతిధ్వనుల లాగ....పిలుపులు.

ఒక కంఠం పురుషుడిది.

రెండో కంఠం స్త్రీది.

“ఫరవాలేదు. ఆగవచ్చు. వాళ్ళిద్దరు...స్త్రీ పురుషులు.... ఇద్దరు కనుక వారిలో పిచ్చివాళ్ళుండరు. ” ఆగాడు రామచంద్రమూర్తి.

పూల మొక్కలలోంచి....

లాన్‌ల మీదుగా....వాళ్ళిద్దరూ. యువతీ....యువకుడూ.

“ మీరు....మీ రెవరు ? ”

“ అది తేలకే కొట్టుకుంటున్నాం. దయచేసి....రండి. కూర్చుని మాట్లాడుకుందాం. ” అతను రామచంద్రమూర్తి చెయ్యి పట్టుకున్నాడు.

“ ప్లీజ్....రండి. మేము మీలాంటివాళ్ళ కోసమే.... మీ కోసమే ఎదురు చూస్తున్నాం. ” ఆమె__దయానిధికి దగ్గరగా వొచ్చింది.

ఏమిటిది ?

ఎవరు వీళ్ళు

వీళ్ళు పిచ్చివాళ్ళేనా? వాళ్ళెవరో తేలక కొట్టుకుంటున్నా మంటారేమిటి ? ఏమిటి వాళ్ళ ఉద్దేశం ?

వీళ్ళు ఎలాగూ వొదిలేటట్లు లేరని—కదిలాడు దయానిధి. రామచంద్రమూర్తికీ తప్పింది కాదు. వాళ్ళ వెనుక వెళ్ళి—పూలమొక్కల మధ్య వాళ్ళ కెదురుగా—దయానిధి పక్కగా—కూర్చున్నాడు.

" మమ్మల్ని—పిచ్చివాళ్ళనుకుంటున్నారేమిటి కొంప తీసి ? "

" ఛ ఛ. "

"మేము ఇంటలెక్చువల్స్‌ము." చెప్పిందామె. "ఎన్నో పుస్తకాలు చదివాను. మార్క్స్....చలం....అమెరికన్ మాగజైన్సు...."

" మనం త్వరగా విషయంలోకి రావడం మంచిది. "

"ఆ మాత్రం జ్ఞానం నాకు లేదనా? పురుషాహంకారం కాకపోతే ఏమిటి ? తరతరాలుగా స్త్రీని నోరు నొక్కేస్తున్నాడు పురుషుడు...."

" స్త్రీ ఏమీ తక్కువ తినలేదు. నిజంగా—స్త్రీ మగవాడిని పెట్టేది చిత్రహింసే. పోలీసు దెబ్బలా బయటకు కనపడకుండా తెగ బాధిస్తుంది. " ఇద్దరూ పోట్లాటకు దిగారు. ఇద్దరి కిద్దరూ ఎదుటివారిని మాట్లాడ నివ్వకుండా అడ్డం పడిపోతూ—గంటన్నరసేపు చేసిన వాగ్యుద్ధం నుంచి అర్థమయిన కొన్ని విషయాల ద్వారా—రామచంద్రమూర్తి మెదడు కొంత కథని పేనుకోగలిగింది చివరకి.

వయోధర్మం కొద్దీ—వాళ్ళిద్దరూ—పరస్పరాకర్షితులయ్యారతనికి యిరవై ఎనిమిదో ఏటా ఆమెకు యిరవై నాలుగో ఏటా. అతని పేరు అచ్చిరాజు. ఆమె పేరు కమల.

" నేన్నిన్ను ప్రేమిస్తున్నాను. " అన్నాడతను.

" ప్రేమ—ఫ్యూడల్ అవస్థను సూచిస్తుంది. " అందామె.

జరిగిన కథ

జయంతి కథ పాఠశాలకేకాక, రైటర్స్‌కి కూడ కనువిప్పు కల్గిస్తుందనుకుంటారు స్నేహితులిద్దరూ. మర్నాడు డా. విజయని కల్సుకోటానికి మళ్ళీ హాస్పటల్‌కి వెళ్తారు స్నేహితులిద్దరూ. మరొక చిత్రమైన కేసొకటి ఎదురవుతుంది. నవలల్లో తేలిపోతూ నవలలని జీవితాన్ని ముడివేసి జీవితాన్ని పాడుచేసుకున్న ' సుషమ ' ఎదురవుతుంది. జీవితంలో నిజంగా ప్రేమించగలను కానీ నవలలోలాగా జీవించలేను అంటాడు ఆమె ప్రియుడు అంతే ఆవిడ బుర్ర తిరిగిపోయింది. ఈ కేసు కూడా డా. విజయని అడుగుదామనుకుంటారు స్నేహితులిద్దరూ.

ఇక చదవండి

" పోనీ—నేన్నిన్ను పెళ్ళిచేసుకుంటాను. "

" నేనే నిన్ను చేసుకుంటాను. "

" ఎలాగయినా ఒకటే. ఇద్దరి పెదవులూ కలిస్తేనే ముద్దు. " నవ్వేశాడతను.

" పెళ్ళి—యిద్దరికీ అవసరం. కనుక—నో కట్నం. "

" ఓ. కె. నా ఆదర్శమూ అదే. "

" కట్నం లేదని — కానుకలుంటాయనుకుంటే — నిరాశే ఔతుంది. "

" ఆశపడితే కదా నిరాశకి ? "

" నావి స్వతంత్ర భావాలు...."

" స్వతంత్ర భావాలు కలవారంటే నాకు చాలా యిష్టం. అందుకే నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నది. తెలివయిన స్త్రీ లభించడం పురుషుడి అదృష్టం. "

" సరే. అంగీకరిస్తున్నాను. "

వాళ్ళ పెళ్ళి చిత్రంగానే జరిగింది. ఆమె మంగళ సూత్రం కట్టించుకోలేదు.

" స్త్రీయే ఎందుకు కట్టించుకోవాలి ? మగవాడెందుకు కట్టించుకోడు ? స్త్రీ పురుష లిరువురూ సమానమే. " అంది తాను చదివిన సీరియల్స్‌నీ డైరెక్టు నవలలనీ జ్ఞాపకం తెచ్చుకుంటూ.

పోనీలే....పెళ్ళాం ప్రధానం కాని పెళ్ళితంతు కాదుగా ? అని సరిపెట్టేసుకున్నాడు. మార్క్స్ .. చలం....చదివిన విద్యావంతురాలు భార్యగా లభించిందని పొంగిపోయాడు. ఆమె—కొన్ని తరహాల సీరియల్స్....కథలు చదువుతుంది—తెలుగులో అవంటే ఆమెకు పిచ్చి.

మొత్తానికి పెళ్ళయి—సంసారం పెట్టారు. అటు పెద్దలూ యిటు పెద్దలూ—వున్నవాళ్ళే తక్కువ....వాళ్ళు చేతులు దులిపేసుకుని..యిక మీ పాట్లేవో మీరు పడండి.... అని వాళ్ళని....గూడు అనబడే సంసారపు గోతిలోకి తోసేసి—చేతులు దులిపేసుకున్నారు.

ఆ సాయంత్రం....మధ్యాహ్న నిద్ర అనంతరం.... అచ్చిరాజు బద్ధకంగా లేచి—" కమ్లా ! " అని పిలిచాడు.

" లేచావా !....తొందరగా టీ చేసి తెండి. ఎప్పుడు లేస్తావా అని చూస్తున్నాను ! "

ఉలిక్కిపడ్డాడతను. తను వింటున్నది నిజమేనా ? కమల—నిద్రలో కలవరించడంలేదు కద ? కమలో, వైష్ణవమాయయో....తేల్చుకుందామని....మళ్ళీ పిలిచాడు. " క....మ....లా ! "

"ఉష్....పక్కనే వున్నానుగా....ఎందుకలా పిలుస్తావు చెవికోసిన మేకలా ? " విసుక్కుందామె. " త్వరగా టీ చేసుకురా. నిద్రలేచేసరికి టీ పడకపోతే నాకు పిచ్చెక్కుతుంది. " టీ యిచ్చి—మనిషిని చేద్దామని—అతను టీ తయారుచేసుకు వొచ్చాడు వంటింట్లోకి వెళ్ళి. కప్పు ఆమె కందించాడు.

ఓ సిప్ తీసుకుని—" నువ్వూ తెచ్చుకో. " అంది ప్రసన్నంగా.

" నేను కిచెన్‌లోనే తాగేశాను. "

" సరే. " అంటూ ఆమె న్యూస్ పేపరందుకుంది.

ఓ అరగంట—పేపరు తిరగేసేసరికి—ఫ్రండ్స్ వొచ్చారు కొత్త దంపతులని చూడ్డానికి.

" రాజూ ! కొంచెం టీ తీసుకు రారాదూ చేసి ? నలుగురమూ కబుర్లు చెప్పుకుంటూ తాగుదాం, సరదాగా.." కుర్చీలోంచి కదలకుండా అందామె.

వొచ్చినవాళ్ళు తెల్లబోయారు. మాటలు పెంచితే మరీ ప్రమాదమనిపించి—మౌనంగా టీ చేసుకు వచ్చాడు ముఖం చేదుగా పెట్టుకుని.

" నువ్వు టీ చేయడంలో ఎక్స్‌పర్ట్‌వి...." అభినందించింది కమల

అతను సంతోషించలేదు. గెస్టులు వెళ్ళిపోయాక.... మెల్లగా అన్నాడు. " కమలా ! నువ్వు నన్ను ఏకాంతంలో ఒరేయ్ అన్నా ఫరవాలేదు. ఎవరేనా వొచ్చినప్పుడు—ప్లీజ్....ఏమండీ అనీ గౌరవంగానూ పిలుస్తూండవూ ? "

" ఎందుకనీ ? నీకు బాగుండలేదా ? "

" వాళ్ళకి బాగుండదని. "

" ఎవరి గురించో నీ కెందుకు చింత ? "

" అది కాదు.... "

ఒక్కసారి ఆమె సీరియస్ ఐపోయింది. " మగవాడు భార్యని ఏమేవ్....ఒసేవ్ అని పిలుస్తూంటే బాగుందా వాళ్ళకి ! ఆడది—భర్తని—నువ్వు, ఏమోయ్....అంటే బాగులేదూ ? ఏమిటి మగవాడి ఆధిక్యత ? తరతరాలుగా.... యుగ యుగాలుగా స్త్రీని యిలాగే అణగద్రొక్కింది పురుషాధిక్యతకల సమాజం. ఈ అన్యాయం యికపై సాగదు! తెలుసుకో....స్త్రీ లేనిదే పురుషుడు లేడు. సృష్టి లేదు. "

" సృష్టి—పురుషుడు లేకపోయినా లేదు. సృష్టికి స్త్రీ పురుషులిద్దరూ అవసరమే. పోతే....మొదట సృష్టించబడినది ఆడమ్ కనుక పురుషుడు అధికుడని...."

" ముందొచ్చాడనా ? అది పొట్టి కట్టు కథ.... అయినా....ముందొచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడి. లేడీస్ ఫస్ట్....మరువకు. " వార్నింగిచ్చి నట్లందామె. " స్త్రీని—పురుషుడు దోచుకోడమనే—నిరంతరంగా సాగుతూ వొచ్చిన అన్యాయానికి—ఆంధ్ర దేశంలో మొట్ట మొదట మన యింట్లో బ్రేక్ పడుతుంది. పాశ్చాత్య దేశాల్లో యిప్పటికే విమెన్స్ లిబ్ ప్రాచుర్యం పొందింది. చూడు రాజా ! నువ్వు నన్నర్థం చేసుకోవాలంటే...." ఆమె లేచి ఒక బౌండ్ తెచ్చింది. దానిలో మూడో నాలుగో—వారపత్రికల సీరియల్ కటింగు లున్నాయి.

" ఈ సీరియల్ నవలలో నాయకిని అర్థంచేసుకో. అప్పుడు నన్నర్థం చేసుకోగలవు. "

అవన్నీ పురుషాధిక్యతను విమర్శిస్తూనూ....స్త్రీ పురుష సమానత్వాన్ని ప్రబోధిస్తూనూ రాసినవే. ఆడదాన్ని తిరగబడమంటాయవి. విషయం — నిస్సందేహంగా మంచిదే. కాని....చెప్పే తీరులోనే ప్రమాదం అంతా పొంచి వుంది. దేవదాసు నవల తాగుబోతులని తయారు చేసింది ప్రేమికుల కంటె. అలాగే ఆ వేడి రచనలు స్త్రీ పురుష సమానత్వం కంటె విడిపోడాలకు కారణ మౌతాయి. నెగెటివ్ అప్రోచ్. అదీ బాధ. ఆ నవలల లోని నాయకి చాలా తెలివైనదే. చురుకయినదే. మాటకి మాట అంటించగలదే. కాని....ఆమె భర్తని మంచి మార్గంలో ( తన మార్గంలో ) పెట్టుకుందుకు మెత్తని పద్ధతి కాక కర్రలూ కత్తులూ పుచ్చుకుంది. దానితో అసలు ధ్యేయం మరుగున పడిపోయింది—జపం విడచి లొట్టలలో పడ్డట్లు.

"ఉదయం—నేను వండాను కదా...రాత్రికి నువ్వొండు." అంటూ లేచి...." నాకు వంకాయ అల్లం కారం యిష్టం. చారు కాచెయ్. నేను కొంచెం అలా తిరిగి వొస్తాను. క్లబ్‌కి వెళ్ళి ఓ గేమ్ షటిల్ ఆడి....త్వరగానే వొచ్చేస్తాను. భోంచేసి కబుర్లు చెప్పుకుందాం. అన్నట్లు....బాత్ రూమ్‌లో



నీళ్ళు పెట్టావా ? " అంది భుజంమీద తువ్వాలు వేసుకుంటూ.

అచ్చిరాజుకి తల తిరిగినట్లయింది. అయినా తమాయించు కున్నాడు. పెళ్ళయిన రెండో రోజునే సంసారం రోడ్డున పడడం—సిగ్గుగానూ అవమానంగానూ అనిపించింది. శాంతమే భూషణము....విదానమే ప్రధానము....మననం చేసుకున్నాడు ' కీ ' తెలిగి వాత పెట్టాలి అని కూడా రహస్యంగా అనుకున్నాడు, కుళాయి దగ్గర బకెట్‌తో నీళ్ళుపట్టి బాత్ రూమ్‌లో పెడుతూ.

తరువాత....ఆమె వెళ్ళిన తరువాత....తన ప్రావీణ్యాన్నంతా చూపి వంట పూర్తి చేసేశాడు. కమల యిచ్చిన సీరియల్ కటింగులు చదువుతూ కూర్చున్నాడు.

" గుడ్ ! హబ్బీ అంటే అలా వుండాలి. " అంది—స్నానంచేసి, ఇస్త్రీ లుంగీ బనీనూ వేసుకుని—ఆహ్వా

విస్తున్నట్లుగా వీధి గదిలో కూర్చున్న అచ్చిరాజుని చూస్తూ కమల—చిరునవ్వుతో.

నయం. చిరునవ్వులు చిందిస్తూ—ఎదురు రమ్మనలేదు స్వాగతం పలకడానికి—అనుకున్నాతడను మనస్సులో.

భోజనాలు చేశాక....మంచాలు వెన్నెల్లో వేసుకుందా మనుకున్నారు.

ఒకటే పట్టుకెళ్ళింది కమల.

"కొన్నాళ్ళవరకూ ఒకటే మంచం చాలు మనకి." శృంగారం సూచించే కంఠంతో చిలిపిగా అన్నాడు.

"అదేంకాదు. ఉదయం—నేను వంట చేశాను. సాయంత్రం నువ్వు చేశావు. ఇప్పుడు ఎవరి మంచం వారు వేసుకుంటే సమానత్వం కాపాడబడుతుంది రోజుకి. అందుకు." అందామె.

"అంతకంటే....నీ మంచం నేనూ, నా మంచం నువ్వూ వేస్తే పరస్పరానురాగం ద్యోతకమౌతుందేమో ?" ఆశగా చూశాడతను.

"అనురాగం....ఆరాధన....అవన్నీ ఫ్యూడల్ బావాలని చెప్పలేదూ ?" విసుక్కుంది. అతనికి—'ఫ్యూడల్' గురించి తెలియదు కనుక—కామోసు అనుకున్నాడు.

ఇద్దరూ—వెన్నెల్లో—మంచాల మీద కూర్చున్నారు. కమల—వెన్నెల్లో—మరీ అందంగా వుంది. అతనికి వెర్రెక్కుతోంది. ఆ అందం కోసమే అతను కట్నాని క్కాక కమలకు దాసోహం అన్నది.

"ఇప్పుడు—మనం జీవితం గురించీ భవిష్యత్తు గురించీ మాట్లాడుకుందాం...."

"చక్కని యీ వెన్నెల్లో....ఏకాంతంలో....అంత కంటె మంచివీ ముఖ్యమైనవీ మాట్లాడుకుందాం. ప్రణయం....శృంగారం...." భయపడుతూనే అన్నాడు. అతని కామె నడుముమీద చేయి వేయాలనిపించింది. వేశాడు.

ఆమె కోపంగా లేచింది. "స్త్రీ అంటే ఆటబొమ్మ కాదు. ఆమెకూ మనసుంది. వ్యక్తిత్వముంది. ఇష్టా యిష్టాలున్నాయి. మీ పాటలకు నాట్యమాడే బొమ్మ అనుకోకండి...." కస్సుమంది.

"నేనేం చేశాను ?" తెల్లబోయాడు.

"పురుషాహంకారంతో నా అనుమతి తీసుకోకుండా వొంటిమీద చెయ్యి...."

" భార్యవే కదా ? శృంగారానికీ యుద్ధానికీ నిబంధన లుండవంటారు. "

" అలా అన్నది—మగవాళ్ళు. భార్య ఐతే ? ఆమె మనిషి కాదా ? ఆమె—మీ—చాపో, మంచమో, పరుపో లాటి ఆస్తా ? " ఎగిరిపడింది ఆమె.

" కాదు....కాదు....కాదు. కాని....నువ్వు నన్ను వినిపించుకో...."

" చెప్పు. "

" సృష్టి—స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణనీ శృంగారాన్నీ కలిగించింది.

అవి....మానసికోద్రేకాలు కనుక మనిషి వశంలో వుండవప్పుడప్పుడు.

అడిగి....అనుమతడిగి పెట్టుకునేది ముద్దూ కాదు, ఆగ్ని ఏసేది జోకూ కాదు. " పరిస్థితిని కొంచెం తేలికగా మార్చుదామనుకున్నాడు.

" అదే పురుషాధిక్యత. ఆడదనగానే ముద్దుపెట్టుకున్నా కాలితో తన్నినా కిమ్మన కూడదు. అంతేగా మీ ఉద్దేశం ? "

" నా ఉద్దేశం అదని నీ ఉద్దేశమయితే—"

" ఎవరి ఉద్దేశాలతోనూ నాకు నిమిత్తం లేదు, నా— స్త్రీ వంటింటి బానిస కాదు సీరియల్‌లోని హీరోయిన్ భావాలతో తప్పితే. ఆమే నేను. నేనే ఆమె. రాజూ ! జాగ్రత్తగా విను. నన్ను నువ్వు రివొల్యూషనరీ అనుకో మరే మనుకో. నేను—.

స్త్రీ మగవాడికి బానిస కాదు. వంటింటికి బానిస అసలే కాదు. పడకటింటి బానిస యింకా అసలే కాదు—అని వాచా మనసా కర్మణా నమ్మి....అక్షరాలా ఆచరించే— స్త్రీని. కనుక—ఒక పూట నేను వండితే....రెండో పూట నువ్వు వండాలి. నేను కాఫీ పెడితే, నువ్వు టీ కాచాలి. ఏ పనయినా యిద్దరమూ చేయవలసిందే...."

" మరి—పిల్లల్ని కనడం–సగం సగం కుదరదే ? "

" అది తరువాత ఆలోచిద్దాం. ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్ .... టెస్ట్‌ట్యూబ్ బేబీస్ .... కల్చర్ .... డెవలప్ ఔతూంది సైన్సు. ఎంబ్రియో—మగవాడి కడుపులో పెరిగి బిడ్డ ఐ—అబ్డామినల్ ఆపరేషన్ ద్వారా శిశువుని బయటపడేసే రోజు—యింకెంతో దూరంలో లేదంటూంది సైన్సు. అంటే—పిల్లలూ పురిటి నొప్పులూ స్త్రీలతో పాటు పురుషులవీ. ఆ రోజు వొచ్చేవరకూ మనం కనొద్దు. " కచ్చితంగా అంది కమల. అతను హతాశుడయ్యాడు.

" మగవాడి ఆధిక్యతేమీ లేదు స్త్రీ కంటె. నువ్వు కొట్టావో నేనూ కొడతాను. తిట్టావో తిడతాను. తిరగబడిన స్త్రీ సీరియల్ నవలలోని తిక్కశంకరి పాత్రే నేను. విమెన్స్ లిబ్ కార్యకర్తని. నువ్వు సిగరెట్ కాలిస్తే నేనూ కాలుస్తాను. తాగితే తాగుతాను. తిక్కశంకరిలాగే నేనూ ఎందుకు బాబ్ చేయించుకున్నానో తెలుసా ? స్త్రీ—పురుషుడి కెందులోనూ తక్కువ కాదని నిరూపించడానికే. "

జుత్తయితే కత్తిరించుకున్నావ్....మరి గెడ్డాం గీసుకోడం సంగతో అని అడుగుదామనిపించింది. కాని.... భయం వేసింది. ఆమె చెప్పినవి వింటూంటే—తాను చేయబోయేది కాపురమా, కత్తులమీద సామా ? అనిపించింది.

" రేపటినుంచి కదా ? ఈ రాత్రి హాయిగా సుఖపడదాం. " అన్నాడు ఆమె మంచంమీదకు రాబోతూ.

" ఇవాళ వొద్దు. నేను కాంట్రాసెప్టివ్ ( గర్భ నిరోధక ) మాత్రలు తెచ్చుకోలేదు. "

" ఒక్క రాత్రికేనా ? " దీనంగా చూశాడు.

" అలాగ నన్ను బుట్టలో వేసుకుందామనా ? అదేం కుదరదు. యుగ యుగాల నుంచీ మగవాడు ఆడదాన్ని యిలాగే మాయచేసి సంసార జంజాటంలో పడేస్తున్నాడు. నువ్వూ నేనూ ఒకటే. సీరియల్‌లో అపర్ణ—పిల్లలవల్లే కదా మొగుడి కెదురు తిరిగి యిల్లు వదలలేకపోయింది ? "

" స్త్రీ స్వాతంత్ర్యమంటే మొగుణ్ణి వొదిలేయడమా?" అడిగేశాడు తెగించి.

"మొగుడు ఒక రాక్షసుడూ రావణాసురుడూ ఐతే...."

" ప్రతి మొగుడూ అలా కాదుగా ? "

"ప్రతి మొగుడూ మొగాడే." స్టేట్ మెంట్ యిచ్చేసింది.

ఆ తొలిరేయి – అలా ముగిసింది. ఆ రేయే కాదు, చాలా రే (యి) లు.

అతను దేనికి భయపడి ఆమెతో గొడవ పడలేదో— ఆ పని – వాళ్ళు కాపురం పెట్టి నెల తిరక్కుండానే జరిగింది. ఆ యింట్లో మగాయన కూరలు తరిగి వంట వండుతాడనీ....ఓ రోజు ఆవిడ బట్టలుదికితే మర్నాడు ఆయనుతుకుతాడు....అంటూ యింటిగుట్టు రట్టు చేసేసింది పనిమనిషి. ఇక ఆ సంసారం గురించి వీధిలో వింత కథలు మొదలయ్యాయి. ఆ కాపురం నలుగురికీ కాలక్షేపంగా మారింది. అచ్చిరాజు ఫ్రండ్స్ అతన్ని చూసి జాలిపడసాగారు. వాళ్ళు జాలిపడ్డారని కాదు కానీ– ఆత్మవిమర్శ చేసుకుంటే....ఏడాది కాపురాన్నీ సింహావలోకనం చేసుకుంటే – తనేం సుఖపడ్డాడో అతని కర్థం కాలేదు. పెళ్ళాం–వీపు రుద్దడానికీ లేదు....ఇంట్లో దీపం పెట్టడానికీ లేదు. వంటా చెయ్యదు, యింటా వుండదు. పైగా ఆవిడకే తను వొండాలి. అసలందరూ ఎందుకు పెళ్ళి చేసుకుంటారో....ఆ సుఖమూ అనుకున్నప్పుడు దొరకదు. ఆవిడకి–మూడ్ రావాలి. నువ్వూ నేనూ ఒకటే ; తిరగబడిన స్త్రీ, మొగుణ్ని వొదిలిన మగువ–లాటి సీరియల్స్ జ్ఞాపకం రాకూడదు. కాంట్రాసెప్టివ్ టాబ్లెట్లు వేసుకుని వుండాలి. అప్పుడు వోన్లే అని ముష్టివాడికి పైసా వేసినట్లు అనుమతిస్తుంది. ఈ తతంగమంతా తలుచుకుంటే తనకి వాంఛ చచ్చిపోతుంది. పోనీ ఎక్కడికేనా పోదామా అంటే–తన వెనుకే ఆమె కూడా బయలుదేరుతుందేమో సమానత్వం పేరుతో అని భయం. హెయిర్ కటింగ్ కని తనోసారి బయలుదేరితే ఆమె కూడా వొచ్చేసింది.

అనుక్షణమూ యీ స్త్రీ పురుష సమానత్వం భరించలేక అతనికి పిచ్చెక్కింది. మగాడు ఆఫీసు బానిస కాదు. స్త్రీని వివాహం చేసుకునేది, నిరంతర నరకం కొనితెచ్చుకుందుకు కాదు. చచ్చినా స్త్రీని పెళ్ళిచేసుకోకు. మూర్ఖులు పెళ్ళిచేసుకుంటారు. పెళ్ళి ఒక పెంటకుప్ప. పెళ్ళాం ఒక రాకాసి–వంటి స్లోగన్సు గోడలమీద రాసేస్తూ... వీధుల్లో అరిచేస్తూంటే అతణ్ని నలుగురూ పిచ్చాసుపత్రిలో పడేశారు.

ఆడదే ఎందుకు పిల్లల్ని కనాలి? ఆడదే ఎందుకు పిల్లలకి పాలివ్వాలి ? ఆడది – మగాడి నీడ కాదు. స్త్రీ సెక్సుకి సంకేతం కాదు. మంగళసూత్రం పలుపుతాడు. పసుపు కుంకుమలు అనాగరికం. తాళులు తెంపేయండి. అప్పుడే స్త్రీకి విముక్తి. ఏ స్త్రీ సంతానం కనదో ఆమే స్వేచ్ఛాజీవి. అని ఆమెకూడా గోడలమీద, రోడ్లమీదా స్లోగన్లు వ్రాసాగింది అతనితోపాటు. నలుగురాడవాళ్ళూ కలసి ఆమెని పిచ్చాసుపత్రిలో పడేశారు.

ఆమెవల్లే పిచ్చెత్తిందని తనకంటాడతను.

అతని వల్లే పిచ్చెక్కింది తనకంటుందామె.

చిత్రమేమిటంటే–ఆసుపత్రిలో యిద్దరినీ ఒకే సెక్షన్లో పడేశారు ! పిచ్చి దంపతులు — మెంటల్ హాస్పిటల్లో ఒకే గదిలో....ఉంటున్నారు. అదీ వాళ్ళ కథ !

" అంటే.... తాళి తెంపిన స్త్రీ.... ప్యాంటు వేసిన పడతి.... మగవాడు కాదు పగవాడు; వంటి సీరియల్సే అన్నమాట వీళ్ళ యీ స్థితికి పరోక్ష కారణాలు ! " అన్నాడు దయానిధి – పాయింటు తీస్తూ.

" ఔను " అన్నాడు రామచంద్రమూర్తి ఆ సీరియల్స్ రాసింది తనే అన్నంత సిగ్గూ విచారమూ పడిపోతూ.

" ఏమిటో.... యీ విజయా డాక్టర్ని కలుసుకోవడం అయ్యేటట్లు లేదు. విక్రమార్కుడి కథలో సాలభంజికలు– మన పాలిట పిచ్చివాళ్ళు. "

" నిరాశపడకు. విసుక్కోకు. త్వరలో మనం లోపలికి వెళ్ళగలమని నా అంతరాత్మ చెబుతోంది. "

" సరే ...చీకటి పడిపోయింది. పద. రేపు మన అదృష్టం పరీక్షించుకుందాం. "

ఈ రచన – సంసారాలని కూలద్రోయదు. ఎవరికీ పిచ్చెక్కించదు. అని రచయితల నుంచి హామీ పత్రం తీసుకుంటే ఎలా ఉంటుందా అని ఆలోచిస్తూ నడవసాగాడు రామచంద్రమూర్తి – దయానిధి వెనుక. (సశేషం)

# అభిప్రాయవేదిక

"శ్రీవాణి పత్రిక ప్రతి పుట మధురమైన పద జాలముతో నిండియున్నది. అన్ని పత్రికల కంటె సాటిలేని మేటి పత్రిక శ్రీవాణి. సాహిత్య సాంస్కృతికంగా చాలా తీర్చిదిద్దారు."

— ఎన్. సుదర్శన్, భైంసా

"శ్రీవాణి కవరు పేజీ మహాప్రవక్తల (మెహర్‌బాబా, సాయిబాబా) కలర్ ఫోటోలతో తెస్తున్నందుకు అభినందనలు. ఇదే విధంగా భవిష్యత్తులో కూడా అనుసరిస్తారని ఆశిస్తున్నాను.

— వి. రామారావు, బిలాస్‌పూర్

"శ్రీవాణిని చక్కగా తీర్చిదిద్దుతున్నారు. భగత్‌సింగ్ పై వ్రాసిన వ్యాసం నన్ను మిక్కిలి ఆకర్షించింది".

— ముదివేడు ప్రభాకరరావు, రీసెర్చ్ స్కాలర్, తిరుపతి

"శ్రీవాణి పత్రిక అందంగా ఉండి, సహృదయ స్పందంగా, హృద్యంగా, మనోజ్ఞంగా, అనితరసాధ్యంగా, వెన్నెల జలతారులా, రసధునిలా, విజ్ఞానఖనిలా, విలసిల్లుతోందనడంలో సందేహంలేదు. ఉత్తమ సాహిత్యపత్రికగా, చైతన్య వాహికగా, సౌజన్య ప్రతీకగా, అందాల మయూఖగా ఉంది అనడం సమంజసం. మీ కృషి ప్రశంసనీయం".

— యస్. రాజశేఖర్, భువనేశ్వర్

"కవితలు, మహాపురుషుల జీవిత చరిత్రలు, సాహిత్యపరమైన విమర్శలు, హాస్యపూరితమైన వ్యాసాలు, సాంస్కృతీపరమైన వ్యాసాలు — సర్వాంగ సుందరంగా ఉన్న శ్రీవాణి సంచికలు చూచి మనస్సు ఆనంద పరవశమైనది. వ్యాపారసరళిలో సాగిపోయే పత్రికలు వచ్చే ఈ రోజులలో — అందరి అభిరుచులను, ఉత్తమాదర్శాలను దృష్టిలో పెట్టుకొని మాసపత్రికను వెలువరించడం కడు ముదావహం. శ్రీ గణపతిరాజు అచ్యుతరామరాజు, శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగార్లు శ్రీవాణిని ఎంతగానో ప్రశంసించారు".

— కె. మల్లికార్జునశర్మ, ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, ఏ. ఐ ఆర్. విశాఖపట్నం

"శ్రీవాణి మాసపత్రికను ప్రతినెల ఎంతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతున్నందుకు ధన్యవాదములు. శ్రీవాణిద్వారా ఉత్తమ సాహిత్య, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక విజ్ఞానాన్ని పొందుతున్నామనడంలో ఎలాంటి సందియములేదు".

— బిక్కనూరి రాజేశ్వర్, పొన్కల్

"శ్రీవాణి పత్రిక చాలా విలక్షణంగా ఉంది. ఈ సమాజానికి ఇటువంటి పత్రిక అవసరం చాలా ఉంది. ప్రతి రచనా ఉత్తమ స్థాయిలో ఉదాత్తభావపూరితంగా ఉంటున్నాయి. ముఖ్యంగా విజ్ఞానశాస్త్రం వ్యాసాలు ఎంతో హృద్యంగా ఉంటున్నాయి. మన సాంప్రదాయం, ధర్మం, కళలు, సంస్కృతి, సమకాలీన సాంఘిక పరిణామాలు, విలువలు, నేటి సంక్షోభ పరిస్థితి, ఆర్తితో, జిజ్ఞాసతో ప్రతిపాదిస్తున్నారు. స్ఫూర్తిదాయకంగా ఉంటున్నాయి రచనలు. ఇటువంటి పత్రిక పదివేల కాపీలైనా ఉత్సుకతతో కొనగలిగితే మనది సభ్య సమాజమని, సాంస్కృతిక విలువల పట్ల ఆసక్తి మనకు ఉన్నదని భావించవచ్చు. అయితే అనుభవం ఇందుకు సహకరించడం లేదు. పత్రికలు అనారోగ్యమైన పోటీతో కుహనా వినోదాన్ని, కృత్రిమ వాతావరణాన్ని ప్రోది చేస్తున్నాయి. ఉత్తమాభిరుచులు, విలువలు వెనుకబడి పోతున్నాయి. మీరు ఈ ఆశాభంగాన్ని నిబ్బరంగా భరించాల్సి వుంటుంది కొంత కాలం. ఇటువంటి అవ్యవస్థ చాలాకాలం సాగదు. మీరు దిటవుతో, అతిజాగరూకతతో యీ సత్ప్రయత్నాన్ని సాగించండి. తర్వాత పత్రికకు మంచి ప్రాచుర్యం లభిస్తుందని నా విశ్వాసం."

— డా॥ అక్కిరాజు రమాపతిరావు, హైద్రాబాద్

# స్వీకారం

" అక్షరాగ్ని " ( కవితా సంపుటి )
వెల : రు. 15-00 రచన : ఆచార్య తిరుమల
ప్రతులకు : ఆచార్య తిరుమల, చైతన్య కళాశాల,
సుల్తాన్‌బజార్ హైదరాబాద్-500 001

" ఆకాశం అంచులదాకా " ( నవల )
వెల : రు. 16-00 రచన : నండూరి రామకృష్ణ
ప్రతులకు : స్వామి పబ్లికేషన్స్ 4-1-528/4
ట్రూప్ బజార్, హైదరాబాద్ - 500 001

" సాహిత్య దుందుభి " ( మాసపత్రిక )
సంవత్సర చందా : రు. 12-00
చిరునామా : బ్రాహ్మణ వీధి
వనపర్తి - 509'03, మహబూబ్‌నగర్ జిల్లా

" హృదయాన్వేషణ " ( గేయ సంపుటి )
రచన : గరికపర్తి రాజేంద్ర ( "సంధ్య" )
వెల : రు. 2-00
ప్రతులకు : గరికపర్తి రాజేంద్ర, పోస్టలు అసిస్టెంట్,
కామారెడ్డి - 503111

" దేవీ స్తోత్రమ్ "
వెల : రు. 2-50
ప్రతులకు : దావులూరి కోటి సూర్యప్రకాశరావు
దావులూరివారి వీధి, కొత్తపేట - తెనాలి

సద్గురు శ్రీ మెహెర్ చైతన్యజీ
మహరాజ్‌వారి ప్రబోధాలు ( ఉచితం )
ప్రతులకు : అవతార్ మెహెర్‌బాబా ఆధ్యాత్మిక
కేంద్రము, రాజమండ్రి

" ఇది కల్పవృక్షం "
వెల : రు. 32
( శ్రీ విశ్వనాథ రామాయణ కల్పవృక్షానుశీలము )

" సాహిత్యం-విమర్శ "
వెల : రు. 16
రచన : వడలి మందేశ్వరరావు
( పై రెండు గ్రంథములు )
ప్రతులకు : శ్రీమతి వి. సీతారత్నం
17-1-391/35 సుబ్రమణ్య నగర్
సైదాబాదు కాలని సమీపాన, హైదరాబాద్-500 001

" చిరు తరగలు " ( మినీ కవితల సంకలనం )
వెల : అమూల్యం ప్రచురణ : శ్రీ సాహితీ
సంస్థ, కరీం నగరం - 505002

" కొత్త యుగం "
( ఆధునిక సాహిత్య వ్యాస సంపుటి )
వెల : రు. 10 రచన : శ్రీ ఏ. సూర్యప్రకాశ్
ప్రచురణ : రచన పబ్లిషర్స్, 1-7-87 పంత్‌రోడ్
ఆర్మూర్ - 503 224

" భగవాన్ శ్రీకృష్ణ గురువాయూరప్పన్ "
అనువాదకులు : డా॥ ఎ. వై. నారాయణాచార్య
వెల : రు. 20
ప్రతులకు : అమరవాది లక్ష్మి
H. No. 9-10-130/3 పిన్నావారి వీధి
వరంగల్ - 506 002

" పోతుకూచి కవితా సాహిత్యమ్ "
( సాంబశివానందలహరి పై విమర్శ )
రచన : చిట్టిమల్లె శంకరయ్య ( రుద్రశ్రీ )
ప్రతులకు : పోతుకూచి ఏజన్సీస్
6-3-195 న్యూ బోయిగూడ, సికింద్రాబాద్

" అలారమ్ " మినీ కవితా సంపుటి
రచయిత : జోరాశర్మ
ప్రతులకు : జోస్యుల శేషుబాల
8/220 శ్రీ సాయి సదన్, గొడుగుపేట, మచిలీపట్నం

★★

## అందరికీ నమస్కారించి... ( 1వ పేజీ తరువాయి )

ది 11-1-1986 న శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవం. ఎందరో మహానుభావులు రావడానికి అంగీకరించారు. ఆ సందర్భమున ప్రత్యేక సంచిక ( సుమారు 120 పేజీలు ) కూడా వెలువడుతుంది. వ్యాపారాభివృద్ధికి " శ్రీవాణి " ఒక మంచి వేదిక. వర్తకులు, పారిశ్రామికవేత్తలు తమ ప్రకటనలద్వారా సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను. ఉన్నవారు జీవితసభ్యులుగాను, మరింత ఆర్థికస్తోమత గలవారు విరాళముల ద్వారాను ( వారి ఫోటోలు ముద్రించబడును) సహకారం అందిస్తారని విశ్వసిస్తున్నాను. లోగడనే జీవిత చందా, విరాళ వాగ్దానం చేసినవారు, వాగ్దానమును వెంటనే ఎట్టి జాప్యం లేకుండా నెరవేరుస్తారని, చందా అయిపోయినవారు వెంటనే "రెన్యూవల్" చేస్తూ, మిత్రులతో కూడా చందాలను కట్టించి సాహిత్య, సాంస్కృతిక, అధ్యాత్మిక, విద్యా ప్రచారానికి చేయూత నిస్తారని ఆశిస్తున్నాను. ప్రతి గ్రంథాలయంలో, విద్యాలయంలో ఉండదగ్గ ఉత్తమ పత్రిక "శ్రీవాణి". వాటి నిర్వాహకులు శ్రీవాణిని స్వంతం చేసుకుంటారని భావిస్తున్నాను.

గత అనుభవం నాకు లేకపోవడంవలన శ్రీవాణిని ఇంకా సమగ్రవాణిగా తీర్చిదిద్ద లేకపోయినాను. అనుభవజ్ఞుల ను ఆహ్వానిస్తున్నాను. శ్రీవాణిని సమగ్ర విజ్ఞానవాణిగ రూపొందించాలని నా ఆకాంక్ష. ఈ మహా ప్రయత్నానికి పరిధిలో వారు సహాయ సహకారములను అందించమని ప్రేమతో అర్థిస్తున్నాను. ప్రథమ వార్షికోత్సవ స్సవంలో పాల్గొనవలసినదిగా యావన్మందిని ఆహ్వానిస్తున్నాను. ధన్యవాదములు

కొమ్మగిరి కృష్ణమోహనరావు

## సంపాదకీయం ( 3వ పేజీ తరువాయి )

ఇది ఏ మాత్రం మంచి సాంప్రదాయం కాదు. ఎల్లో జర్నలిజాన్ని నిరోధించాలనే తలంపుతో ప్రెస్ బిల్లును తీసుకొనిరా ప్రయత్నించడం, ఎలుకలను తుద ముట్టించడానికి ఇల్లునే తగులపెట్టడం లాంటిదే అవుతుంది.

ఇటువంటి అక్రమ చట్టాల వలన సంవత్సరాల తరబడి పోరాడి తెచ్చుకున్న స్వాతంత్ర్యానికే విలువ లేకుండా పోతుంది. ఆనాడు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం జరిపిన పోరాటం, చేసిన త్యాగం బూడిదలో పోసిన పన్నీరులా వృథా అయిపోతుంది. స్వాతంత్ర్యంకోసం తిలక్ చేసిన త్యాగం, స్వేచ్ఛ కోసం నేతాజీ జరిపిన పోరాటం, రామరాజ్యంకోసం గాంధీజీ జరిపిన సత్యాగ్రహం, సామ్యవాద స్థాపన కోసం నెహ్రూజీ చేసిన త్యాగం, నియంతృత్వానికి వ్యతిరేకంగా పటేల్ నడిపిన బార్డోలి సత్యాగ్రహం, ప్రాథమిక హక్కుల కోసం అంబేత్కర్ జరిపిన కృషి, బ్రిటీష్ తుపాకులకు ఎదురు రొమ్ము నిచ్చిన ప్రకాశం ధైర్య సాహసాలు—అన్నీ వృథా ! వృథా ! వృథా !........

" Liberty Postulates Dignity of Man " అని జాన్‌స్టువార్డుమిల్ ఏనాడో పేర్కొనినాడు. స్వేచ్ఛ మనిషి గౌరవానికి మూలం. అది లేని ( తెలుగు ) నాడు, అది లేని ( తెలుగు ) దేశం, నియంతృత్వ ( తెలుగు ) దేశం అవుతుంది.



# శ్రీవాణి ప్రథమ వార్షికోత్సవము

ది 11-1-1986 సాయంత్రం గం. 5-55 ని. మచిలీపట్నం టౌనుహాలు ఆవరణలో

అధ్యక్షులు : శ్రీ సుంకర సత్యనారాయణ (ఛైర్మన్, కృష్ణాజిల్లా పరిషత్)

ప్రారంభకులు : శ్రీ వసంత నాగేశ్వరరావు (గౌ. హోం మంత్రివర్యులు)

ముఖ్య అతిథి : జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావు (లోకాయుక్త)

ప్రసంగ విషయం : "ఆధునిక సమాజం .. పత్రికల బాధ్యత"

ప్రధానోపన్యాసకులు : డా॥ ఇలపావులూరి పాండురంగారావు (Director, UPSC, New Delhi)

విషయం : "సాహిత్యం - ఆధ్యాత్మికత"

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ (Prof. Kamaraj University, Madurai)

విషయం : "సారస్వత వైవిధ్యం - సాహిత్య ప్రయోజనం"

డా॥ ప్రసాదరాయకులపతి (Lecturer, Guntur)

విషయం : "సాహిత్యం - సంస్కృతి"

శ్రీ ఆర్. యస్. సుదర్శనం

(Regional Director, Higher Education, Rajahmundry)

విషయం : "సాహిత్యం - సామాజిక స్పృహ"

జీవితసభ్యత్వ పత్ర ప్రదానము: డా॥ సుంకు బలరాం

(Chairman, M/s. Sunku Auto (P) Ltd., Hyderabad)

"శ్రీవాణి"కి ఆశీస్సులు : శ్రీ వడ్డే శోభనాద్రీశ్వరరావు M. P (Vijayawada)

శ్రీ కావూరి సాంబశివరావు M. P. (Machilipatnam)

శ్రీ వడ్డి రంగారావు M. L. A. (Machilipatnam)

శ్రీ పేర్ని కృష్ణమూర్తి (Municipal Chairman, Machilipatnam)

సన్మానము : శ్రీ భాగవతుల కుటుంబరావు, శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగార్లకు

ప్రత్యేక సంచిక-క్రొత్త శీర్షికలు : 1. రంజనిమాల (Cross Words) నిర్వహణ - డా॥ వి. ఫణీంద్రుడు 2. పుస్తక సమీక్ష 3. విజ్ఞానదాయకమైన ప్రశ్నలు - సమాధానములు 4. జ్యోతిషవాణి, నిర్వహణ - దైవజ్ఞరత్న, వాస్తు జ్యోతిషవిద్వాన్ శ్రీ కవితా కామేశ్వరశర్మ, అవనిగడ్డ-521 121

నిబంధనలు : జాతకచక్రం, జనన తేదీ, దశాశేషం పంపుతూ రెండు ప్రశ్నలు పంపవచ్చును. జాతకచక్రం లేనివారు ఉత్తరము వ్రాయు కాలము తెల్పుతూ రెండు ప్రశ్నలు పంపవచ్చును. శ్రీ శర్మగారికే సరాసరి వ్రాయవలెను. పాత శీర్షికలు యథాతథంగా నిర్వహించబడును.

